


శ్యామ్ అంది మైధిలి (ఈవిడకీ రెండక్షరాల పేర్లంటే ఇష్టం కాబోలు) రావుగారికి ఇంగ్లీషు సినిమాలంటే ఇష్టమేమో మంచి ఎవార్డు విన్నర్ వుంది తీసకెళ్ళకూడదూ దుర్గకి యిష్టం లేకపోతే నేనూ అమే ఉండిపోతాం

ఆవిడా చూస్తుందిలెండి అనేశాడు రామారావు కనకదుర్గ నోరు విప్పేలోగా ఆవిడ వస్తే వస్తుంది లేకాపోతే యింట్లో కూర్చుని కుక్కపిల్లకి పేలు చూస్తుంది మీరుమాత్రం రావడం మానెయ్యకండి - మైధిలిగారూ అని అతని మాటలు అర్ధం చేసుకుంది దుర్గ

ఏఁవిఁటా సినీమా మిల్లీ ? శ్యామ్ అడిగాడు మిల్లీ ! మిల్లీ !! ఎంతందమైన పేరు ? కనా కకా కదూ ' సినిమాలో చాలాచోట్ల మైధిలి గట్టిగానే నవ్వింది ఈవిడకి అర్థంకాని విషయం లేదు కాబోలు ఆఖరికి ఇంగ్లీషు సినిమా కూడా పూర్తిగా అర్దం చేసుకునేట్టుంది ఆవిడ మళ్ళీ నవ్వినప్పుడు నవ్వామని అర్థం అయ్యేట్లు రామారావు కనకదుర్గ చెయ్యి గిల్లేడు కనకదుర్గ నవ్వలేదు సరికదా అమ్మో అంది

దోమ కుట్టుంటుంది సర్దేశాడు రామారావు

సినిమా తర్వాత బాల్కనీ రెయిలింగు మీద సున్నితంగా చెయ్యి అనించి దిగుతున్న మైధిలి దంతంపెట్టెలో పెట్టిన దంతంబొమ్మలావుంది అసూయ కనపడనీయకుండా రామారావు శ్యామసుందర్ భుజం తట్టేడు

రాత్రి భోజనాలదగ్గర

"ఏఁవిఁటో నావంట అంత రుచించినట్టులేదు రావుగార్కి తను అంతవరకూ ఎక్కివున్న ఉన్నత ప్లేట్‌ఫారం మెట్టు ఒకటి దిగుతున్నట్టు అంది మైధిలి

( కనకదుర్గ కందిపచ్చడికి అలవాటుపడిన నోరు క్రప్పేళ్లైనా రుచిగా తినెయ్యగలదు) ''రుచిసంగతి తర్వాత చెప్తాగాని యివన్నీ మీరే చేశారా ?' మూర్ఛపోయేడు రావు

అదేవిటండీ! మరీ మా చెల్లెల్ని అనాడీ చేసేస్తున్నారు? ఆవిడమాత్రం చెయ్యదుటండీ యీమాత్రం? "

"చెయ్యదనికాదు. ఇన్ని చెయ్యడానికి మీకు టైము ఎక్కడిదా అని ఆశ్చర్య పోతున్నా నంతే!" రామారావుకి ఒక్కసారి ఆకలంతా చచ్చిపోయింది ఎంచేతో.

*  *  *

"ఈవేళ ఆదివారం మిల్లీ..." అన్నాడు శ్యామ్.

"మధ్యాన్నం గెస్టుకి డేమ్ సైట్ చూపిద్దాం. సాయంత్రం ఎలానూ ఫ్రెండ్సుదగ్గరకి తీసుకెళ్తాంకదా!''

"మార్వెలస్ ప్రోగ్రాం. ఎవరి దగ్గరకు కెళ్ళాలోకూడా నువ్వే చెప్పు."

"ఎస్. ఇ. జగన్నాధరావుగారింటికీ, కృష్ణమూర్తిగారింటికీ. హిదాయతుల్లా యింటికీ తీసుకెళ్ళాలి రాత్రి మనందరికీ వెంకట్రావుగారు డిన్నరిస్తామని చెప్పేరుగా

"హనుమంతరావింటికి వెళ్ళక్కర్లేదా?"

"మీ ఇష్టం అతను మంచివాడు కాదనికాదు కాస్త బోర్ అంతే ఆమె ఎవర్నీ విమర్శించడం రామారావు అంతవరకూ వినలేదు

మధ్యాహ్నం డేమ్ సైట్ లో నే ఎండనపడ్డ పువ్వులా వాడిపోయింది దుర్గ సాయంత్రం ఎక్కడికీ రాలే ననేసింది కాని రామారావు బలవంతంమీద బైల్దేరక తప్పలేదామెకి

*  *  *

దగ్గర్లో వున్నారని ముందు మీ యింటికే వచ్చేం మిష్టర్ హనుమంతరావ్?" అంటూ గేట్లో ప్రవేశించింది మైధిలి.

"రండి రండి. మీ రాకవల్ల మా గృహం పావనమైంది," అంటూ ఎదురొచ్చేరు హనుమంతరావు.

"ఒట్టి నాటకాలగాడు," అనుకున్నాడు రామారావు.

పరిచయాలు అయ్యేక "జినియాలు బాగా వచ్చేయే!" మెచ్చుకుంది మైధిలి.

"వీటికి పోసేవి వట్టి నీళ్ళుకాదు - కన్నీళ్ళు," అన్నాడు హనుమంతరావు.

("బేడాపరక కవిగాడు.")

"కారు రీబోరింగైపోయిందా?" మైథిలే మళ్ళీ అడిగింది పోర్టికోలో అమెరికన్కారువేపు చూస్తూ

"ఐపోయింది నాకు నా తోటన్నా నా కారన్నా నా స్నేహితులన్నా ఎంతో గర్వం" అన్నాడు

ఎచ్చాపాటీలో మైథిలి చైనా దురాక్రమణ మొదలు చక్కెర కరువు వరకూ కమ్యూనిష్టు మేనిఫెస్టో మొదలు కరువు భత్యంవరకూ అన్నిటిగురించీ ఎంతో తెలివిగా మాట్లాడింది

"త్వరలో మావో పతనం తప్పదంటాను నువ్వేమంటావు దుర్గా?" అడిగింది ఆమె

త్వరలో మావారి పతనం తప్పదు.' అనేద్దా మనుకొని "ఏమో చెప్పడం. కష్టం." అంది పైకి దుర్గ

న్యూస్‌పేపరు, పొయ్యి అంటించు కుందికి కాదే తల్లీ అంటే విన్నావూ ? మళ్ళీ బియ్యే పేసయ్యేవ్ !" మనసులోనే విసుక్కున్నాడు రామారావు.

కబుర్ల తర్వాత అంతా లేచేరు. "రేపు మా యింటో లంచ్ కాదనకండి," అర్థించాడు హనుమంతరావు.

కళ్ళతో మాట్లాడుకున్నారు శ్యామసుందర్, మైథిలీ.

'నువ్వన్నది కాదనగలమా ?'' వప్పేసుకున్నాడు శ్యామ్. తర్వాత వచ్చేశారు అంతా.

హనుమంతరావు ఇంజనీరింగు పేసై కంట్రాక్టులు చేస్తున్నాట్ట. "బాగా డబ్బుంది అన్న గర్వంకూడా వుంది," అనేసింది మైథిలి.

* * *

రాత్రి డిన్నర్నుంచి తిరిగొచ్చి లాన్లో బాతాఖానీ కొడుతుంటే పన్నెండు దాటి పోయింది.

"పాపం, చెల్లి అలిసిపోయినట్టుంది. నిద్రేమో!'' జాలిపడింది మైథిలి.

"లేదు," కనకదుర్గ కలవరింత.

''మీరు ఇప్పుడు నిద్రపోతారా లేక యిప్పుడే నిద్ర లేచేరా ?'' చొరవగా అనేశాడు రామారావు.''

"ఎంతభిమానం రావుగారికి నామీద."

"అదికాదు. మీకు అలస టన్నది అస లుందా అని! పొద్దుట్నుంచీ ఒక్కలా పనిచేస్తూనే వున్నా - ఎంత ఫ్రెష్‌గా వున్నారు !''

"అబ్బే ఏమంత పనండీ!"

''మీ రేం తింటారో మా దుర్గకి కూడా కాస్త చెబ్దురూ !''

''ఏవుందీ. అంతా తినేదే. కాకపోతే వారానికో పదిరోజులకో సుందర్‌గారి చివాట్లుకూడా," అని నవ్వుతూ, ''సరదా కన్నాను. ఏమనుకోకండీ," అని శ్యామ్‌కి క్షమార్పణ చెప్పింది.

''మీరు రాత్రి ఎంతకి పడుకుంటారు మామూలుగా," అడగకుండా వుండలేక పోయేడు రామారావు.

'అది మావా రిష్టం. ఆయనగారికి వెన్నెలరాత్రన్నా, చుక్కలరాత్రన్నా ఒక్కలాగే మతిపోతుంది. ఆయనది కళాత్మక హృదయం. పాపం దుర్గ నిద్ర పోయినట్టుంది. లెండి పడుకుందురుగాని."

తమ వూరు తిరిగివచ్చేక రామారావు ముగ్గుర్నే తల్చుకునేవాడు.

ఆదర్శవంతురాలైన భార్యగా మైథిలిని -

అదృష్టవంతుడిగా శ్యామ్‌ని -

తనకి తీరని ద్రోహం చేసినవాడుగా దేవుడ్నీ.

* * *

తర్వాత రెండు కుటుంబాల మధ్యా మైత్రీ, రాకపోకలూ పెరిగేయి. ప్రతిసారి చూసినప్పుడూ మైథిలిగురించి రామారావు అభిప్రాయం పెరుగుతూనేవుంది.

ఆవేళ మైథిలిగారి వూరు వెళ్ళిన రామారావు తల పట్టుకొని కారుదిగటం చూసి ఆతృతగా ఎదురువెళ్ళి చెయ్యి పట్టుకుంది దుర్గ. ఆతనివళ్ళు వేడిగాలేదు.



ఆమె భుజంమీద అభిమానంగా చెయ్యి వేశే డతను.

"ఏవండీ ! ఏం జరిగింది ?''

''ఏం లేదు.''

''ఏదైనా ఏక్సిడెంటు జరగబోయిందా?"

"లేదు."

''అక్కడంతా క్షేమమా ?''

"........."

"శ్యామసుందర్ బావున్నాడా ?"

"ఊఁ."

''మైథిలీ ?"

"లేదు.''

''ఏవూ రెళ్ళింది ?''

"........."

కొన్నిక్షణాలు ఒకరిగుండె రెండో వారికి విన్పించేటంత గట్టిగా వారి గుండెలు కొట్టుకున్నాయి.

''హనుమంతరా వున్నాడా ?''

".........."

ఇంట్లోకి వచ్చేశారు వాళ్ళిద్దరూ. "ఆవేళ మీ కాఫీలోని ఈగను వంటింట్లో చేత్తోనే తీసేసింది.''

ఆమె కళ్ళల్లోకి చూశా డతను. చిన్నప్పుడు ఎప్పుడో పారేసుకున్న బొమ్మ దొరికిన ట్లయింది.






(గత సంచిక తరువాయి)

శంకరం ఆఫీసుకి ఎయర్దేరబోతూ తాళం తీసుకుని గదిబయటికి వచ్చాడు. చొరవగా గేటు తోసుకుని వస్తూన్న పెద్దమనిషిని కొంచెం ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు. సాధారణంగా క్లయింట్సెవరూ ఆఫీసుకేగానీ యింటికి రారు.

మల్లుపంచే - జరీ కండువా - బుగ్గ మీసాలూ - వేళ్ళనిండా వుంగరాలూ - చేతిలో వెండిపిడి చేతికర్రా - వస్తోన్న వ్యక్తిని ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు శంకరం. "ఎవరో పల్లెటూరు మోతుబరిలా వున్నాడే! ఎక్కడో చూసినట్టు... అవును... ఈయన ఈయన..." జ్ఞాపకాలతో కుస్తీ పడుతూ - కుతూహలంగా చూస్తూ నించున్నాడు శంకరం

వచ్చిన వ్యక్తికూడా శంకరాన్ని ఎగాదిగా చూశాడు - సూటూ - బూటూ - ఎత్తుగా - దృఢంగా - చెట్టంత వున్న శంకరాన్ని నోరు తెరిచి గుడ్లప్పగించి చూస్తూనే వున్నాడా పెద్దమనిషి.

మెరుపు మెరిసినట్టు గుర్తువచ్చింది శంకరానికి ... తిరపతయ్య ... తిరపతయ్య ... అరె! ఈయన రావటం ఏమిటి? సంభ్రమంగా ఆహ్వానిస్తూ - "రండి, రండి...ఎవరో అనుకున్నాను. నేనండీ! శంకరాన్నే... లోపలికి రండి," అంటూ రెండడుగులు వేసి తిరపతయ్యకు ఎదురెళ్ళాడు. తిరపతయ్యని పూర్వంలా చనువుగా పిలవలేకపోయాడు శంకరం.

"హరి నీ తస్సాదియ్యా! ఎంతోడి వెంతోడి వయ్యావురా? దొరబాబులా నించుంటే పోలికే దొరకందే!" అన్నాడాయన ఆశ్చర్యపడిపోతూ.

శంకరం వుత్సాహంగా గదితలుపులు బార్లాతీసి కుర్చీలు సర్దాడు

"కూర్చోండి; ఇలా కూర్చోండి మావయ్యా! నన్ను జ్ఞాపకం పెట్టుకుని మరీ వచ్చారు ..."

"ఆఁ, దాం దేవుందిలే. ఎలాగూ వూళ్ళో కొచ్చామగందా - నిన్నోసారి చూసి పోదారనీ..." అంటూ తిరపతయ్య కుర్చీలో కూర్చుని చేతికర్ర ఒళ్ళో పెట్టుకున్నాడు.

శంకరం టేబుల్ కానుకు నిలబడ్తూ మిమ్మల్ని చూసి చాలా కాలమయి పోయిందండీ!" అన్నాడు నవ్వుతూ

"ఏదీ? నువ్వసలు వూళ్ళోకొ స్తేనా? గొప్పోడివై పోయావ్. బస్తీలో వుండే వోడివి పల్లెటూరు మొఖంచూస్తావా?" అన్నాడు తిరపతయ్య – నవ్వుతూనే చెప్పుతూ.

"అది కాదండీ!" అన్నాడు శంకరంకూడా నవ్వుతూ. తిరపతయ్య తల బంతిలా తిప్పుతూ గదంతా తనిఖీ మొదలెట్టాడు.

"అత్తయ్య ఖులాసాయేనా?" అన్నాడు శంకరం.

'ఆఁ, అదేకులాసా. నీకు తెలవందే వుంది? బతికిందీకాదు, సచ్చిందీకాదు."

ఆ ధోరణి కొత్త కాదు శంకరానికి. ఇంతకాలానికి మళ్ళా వింటోంటే సరదాగా కూడా వుంది.

తిరపతయ్య మళ్ళా అల్మైరాలో పుస్తకాలవేపూ - టేబుల్ మీది రేడియో వేపూ - దోమతెర ఎత్తివున్న మంచంవేపూ - నేలవేపూ - నెత్తివేపూ పుల్తూ - పుల్తూ - చూస్తూ కూర్చున్నాడు.

తిరపతయ్య ఇన్నాళ్ళకి జ్ఞాపకం పెట్టుకుని రావటం ఆశ్చర్యంగానే వుంది శంకరానికి.

అల్మైరాలోంచి ఒక యాపిల్ పండూ – చాకూ తీసి, ప్లేటునిండా ముక్కలు కోసి, తిరపతయ్య ఎదరగా టేబుల్ అంచున పెట్టాడు. గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి పక్కనే పెట్టాడు.

"తీసుకోండి మావయ్యా" అంటూ స్టౌ వెలిగించి ఓ కప్పునీళ్ళు పడేశాడు.

"ఇదంతా ఏంటోయ్? ఆ డబ్బా పొయ్యి అంటించా వెందుకు?" అంటూ మోమాటపడ్డాడు తిరపతయ్య.

"ఏంలేదండీ! పాలున్నాయి. కొంచెం కాఫీ పెడదామని..."

"హారినీ, అన్నీ సౌకర్యంగానే వుంచుకుంటా వన్నమాట," అంటూ యాపిల్ ముక్కలు గుప్పిటినిండా తీసుకున్నాడు - పరపరా నముల్తూ - "అచ్చంగా జామకాయిలాగే వుంది సుమా! మా పెద్దపిల్ల తిరపతెళ్ళినప్పుడు ఇలాంటి కాయలే నాలుగైదు తెచ్చిందిలే. వూళ్ళో అందరికీ రుచి చూపించాం. మా బాగుంటాయి. మాంచి బలవంటగా?" మిగతావికూడా రెండో గుప్పిటితో పట్టుకుని ప్లేటు దూరంగా పెట్టాడు.




"ఇంతకీ నీ పని బాగా సాగుతోందా?" శంకరం యోగక్షేమాలు కనుక్కోవటమే తన కర్తవ్యం అన్నంత అభిమానంగా అడిగాడు.

శంకరం కొంచెం అయిష్టంతో జవాబు చెప్పలేదు.

కాఫీ కలిపి కప్పు టేబుల్ మీద పెట్టాడు.

"నువ్వు సొంతంగానే కేసులయీ పడతన్నావంటగా? మొన్న ఏదో పనిమీద మా పెద్దల్లుడు కోర్టు కొచ్చినప్పుడు – నువ్వు వాదించటంఅదీ చూశాడంటతే – ఘుమాయించి ఏదో అడిగేసరికి జడ్జీ నోరెత్తలేదంటగా?"

శంకరానికి నవ్వొచ్చింది. చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు.

"చదూకునోడు చదూకునోడే. నీ యినయం – నీ తెలివితేటలూ మా కొచ్చి చస్తయ్యా? అవుతే నువ్విప్పుడు పెద్దప్లీడరుగారి దగ్గిర మానేసినట్టేనా?"

"లేదండీ! అక్కడే వున్నాను. ఎవరిపని వాళ్ళదే."

"నెలకేమాత్రం వస్తదేంటి నీకు?"

"ఐదారు వందల పైమాటే:"

అబద్ధాన్ని అతిశయంగా చెప్పాడు శంకరం.

"ఓరినీ! కాలుమీద కాలు వేసుకుని మరీ సంపాదిస్తన్నావ్. డబ్బంతా ఏంటి చేస్తున్నావ్?"

"ఇలా వస్తే అలా ఖర్చయి పోతుం

దండీ! రేపు గడించలేమన్న భయం వుంటేగా వెనకేసుకోటానికి ?"

"అదీ! మొగోడై పుట్టాక అలాంటి ధయిర్యం లేకపోతే ఎందుకూ ? అవుతే... నీ తిండీ... అదీ..."

"పోఁటళ్ళే. అరె! కాఫీ చల్లారి పోతోంది. తీసుకోండి."

"ఫర్వాలేదులే; చల్లారినా బాగానే వుంటది నాకు. మీఅత్త ఎప్పుడన్నా ఏడి ఏడిగా యిచ్చిచచ్చిందా ఏంటి ?" అంటూ కప్పు అందుకున్నాడు తిరపతయ్య, చప్పగా చల్లారిన కాఫీ గడగడా తాగేసి కప్పు కింద పెట్టి, మీసాలు తుడుచుకుంటూ – "నా కెప్పుడూ నీ మీద మంచి నమ్మకవేఁ సుమీ!" అన్నాడు.

శంకరం ఆశ్చర్యంతో తలమున్కలయ్యాడు. కాఫీకప్పు కడిగి అల్మైరాలో పెట్టేశాడు.

"పెద్దోళ్ళొదిలేస్తే నువ్వుగామట్టి యింతవుర్దిలోకొచ్చావుగానీ...మరెవడన్నా అయితే మట్టిగొట్టుకుపోను."

శంకరం చురుగ్గా చూస్తూ నవ్వుతూ అన్నాడు – "మీ రన్నమాట నిజమే. ఎవరయినా పాడైపోతే చూద్దామని సరదాపడే మహానుభావులమధ్య ఇంకెవడయినా అయితే ఏమయిపోయేవాడో!"

"అదేగా నేనూ అంటున్నానూ! నీ తెలివితేట లెక్కడా! నీ గడుసుదనం ఎక్కడా! ఆఁ నీ ఇదే ఏరు

తిరుపతయ్య పొగుడుతోంటే ఒళ్ళు మండింది శంకరానికి.

"మీ నాన్న కవుఁ రేదన్నా తెలిసిందా నీకు ?" వున్నట్టుండి జాలిపడుతోన్నట్టు చూశాడు తిరుపతయ్య – "పాపం సాలా యాతన పడతన్నాడోయ్."

శంకరం మాట్లాడలేదు.

"దొంగముండ. వున్నన్నాళ్ళూ నూని పిండుకున్నట్టు పిండుకుందా? ఇప్పుడు నానా ఖాదలూ పెడతంది. తిండికికూడా మలమలా మాడతన్నాడంటే నమ్ము......ఇంకా ఏంటేంటో సవాలక్ష పుకార్లు బయల్దేరాయిలే; నిజం నిమ్మళంమీద తెలవాల."

దానికీ మాట్లాడలేదు శంకరం.

"ఏదో దేవుడిదయవల్ల నువ్వా గడికట్టావు... పెళ్ళీ...అదీ అయిందనిపించుకుని......ఆ ముసిలోణ్ణికూడా తెచ్చేసుకో – బాగుంటది. లోకం మెచ్చుద్ది."

శంకరం టేబుల్ మీద కాయితాలేవో సర్దుకుంటూ నించున్నాడు.

తిరపతయ్య కేం అంతుచిక్కలేదు. ఎదరగా నిలబడి అన్నీ వింటూకూడా మాట్లాడకపోతే ఎవ డేం చెయ్యగలడు ?

ప్రశక్తి మార్చి హుషారుగా కుర్చీలో అటూ ఇటూ కదులుతూ –







"చల్లకొచ్చి ముంత దాచటం ఎందు గ్గానీ - శివయ్యా! నీతో ఓ ముక్క మాట్లాడి పోదారని వచ్చాననుకో. చెప్పమంటావా?" అన్నాడు తిరపతయ్య వక్కలు లోలకబోస్తూ.

శంకరం కాయితాలు సర్దడం ఆపి వెనక్కితిరిగి నవ్వుతూ - "చెప్పండి. దాని కేం?" అన్నాడు.

"అవున్లే. నీ గుణం నాకు తెలవదా? మా బంగారాన్ని ఎరుగుదువుగా?... బంగారంటే నవ్వుతావేమో - ఏదో ఆ రోజుల్లో పెట్టేశాం. బాగుండక పోతే ఏ సినిమాలో పేరో పెట్టుకో వచ్చులే. నీ యిష్టం. ఇంతకీ బంగారి నీకు తెలుసుకదా?"

శంకరం నవ్వి- "బంగారి తెలియక పోవటం ఏమిటి?" అన్నాడు.

"అదేనయ్యా! దాని కెక్కడా మంచి సంబంధం కుదర్లేదు. బొత్తిగా చదువూ చట్టబండలూ లేని పల్లెటూర్ది మొద్దులకి పిల్ల నివ్వాలంటే... ప్రేణం ఒప్పదు... పైసమ్మంధా లేవీ మీ అత్త కిష్టంలేదు. అందుకనీ......నిన్నడగ మనీ... అసలు బంగారిక్కూడా నువ్వం టేనే ప్రేణంతే."

శంకరం ప్రాన్పడిపోయాడు. వింటోన్నది నమ్మలేనంత ఆశ్చర్యపో యాడు. ఆశ్చర్యంతోపాటు ఆవేశం కూడా ముంచుకొచ్చింది.

"మొన్నోసారి మీ నాన్నదగ్గిరి

కెళ్ళి కదిపిచ్చూశాలే. చంక యెగరేసి నంత పని చేశాడు. చిన్నోడివైనా, నిన్నూ అడిగి వూఁ అనిపించుకు పోదారనీ...వూఁ అన్నావో...వారం తిరక్కుండా అన్నిఖర్చులతోటీ పెళ్ళి చేయించేస్తా ... నేనుమాత్రం మంచీ చెడ్డా ఎరగనోణ్ణా ఏంటోయ్? కాలం ఎలా మండిపోతోందో ఎరగనా? ఓ ఎయ్యిరూపాయలు ఎక్కువేగానీ. . తక్కువ చెయ్యను. బంగారికి ఒంటి నిండా బాలతొడుగుందా? పెద్దపిల్ల కిచ్చినట్టుగానే దీనికీ పదెకరాల మాగాణీ – రెండెకరాల మామిడి తోటా యిస్తాను. కాదంటే ఇంకో ఎకరం ఏసుకో. నా పిల్లే కదా తింటది?...... నీ ముద్దుముచ్చట్లు మాత్రం నాకు తెలవ్వా? మోట్రు సైకిలూ...వాచీ గడియారం...... ఇంకేంటేంటి కావాలో నాకేం తెలుస్తది? నీ యిష్టవేఁ...కాదంటే పది మందిలో చెప్పుచ్చుక్కొట్టు."

శంకరం స్థాణువులా నించున్నాడు.

"బంగారి నిప్పుడు మాస్తే ఆశ్చర్య పడతావనుకో. అచ్చం బస్తీపిల్లలాగే వుంటది. రెండు జళ్ళేసుకుంటది. కతల పుస్తకాలయ్యా చదువుద్ది. అసలు నువ్వు వూళ్ళోకి రావటం మానేశావు గానీ, బంగార్ని చూస్తే...నువ్వే పెళ్ళిచేసుకుంటానని అడిగేవోడి వనుకో

కోపం నవ్వూ కలగలుపుగా వచ్చాయి శంకరానికి. పగలబడి నవ్వా లనీ వుంది; కసిదీరా తిట్టాలనీ వుంది.

"నీ మనసులో మాటేంటో చెప్పేస్తే..."

"ఏం చెప్పమంటారు?" ఘాటుగా చూశాడు శంకరం– "మీరు భాగ్య వంతులు; ఖూఖామాందులు. మీలాంటి వారిదగ్గిర – ఒక పాలేరులాగా వుండాల్సినవాణ్ణిగానీ .. మీ అల్లుణ్ణి కావటం......అబ్బే! అలాంటి పిచ్చి పిచ్చి ఆశలు లేవండీ నాకు..."

తెల్లబోయాడు తిరపతయ్య– అంత వరకూ నవ్వుతూ వింటున్న శంకరం అంత నిర్మొహమాటంగా మాట విసరటంతో ...

"ఇ... హి ... హి ... హి ... "
అంటూ పళ్లు వెళ్ళబెట్టి మళ్ళీ నవ్వాడు. "అప్పు దేదో ఆసికాని కంటే యింకా గ్నేపకం పెట్టుకున్నావూ? నీ అఘాధ్యం గూలా!" అంటూ ధైర్యం తెచ్చు కున్నాడు – "చూడబ్బాయ్! నా కూతురికి లఖాతోం ఖై సమ్మంధా లొస్తానే వున్నాయి. నువ్వు మంచోడి వనీ – గుణవంతుడివనీ – అన్నింటాలా ఎరిగినోడివనీ నా తాపత్రయంగానీ... ఉంకోటికాదు. కాళ్లూ చెయ్యీ వున్న న్నాళ్ళూ సంపాదిస్తావు, బాగానే వుంది. కీడెంచి మేలెంచాలన్నారు. నరుడికి నాలుక్కాలాలు. పొలం పుట్రా






అండా దండా వున్న పిల్లని కట్టుకోటం నీకూ మంచిదే. మా పెద్దల్లు డేదో సమ్మంధం కుదురుస్తానంటే కాదూ కూడదని నీకోసం వచ్చాను. నువ్వేమో... చిన్న కుర్రోడిలాగా... ఎప్పుడో...ఏదో అయిందని...ఆవూ సే గ్నేపకం పెట్టుకుని ..."

శంకరం తాళాలు చేతిలోకి తీసుకుంటూ-నిర్త్సాహమాటంగా అన్నాడు- "జగిందేమిటో నాకూ గుర్తుంది, మీకూ గుర్తుంది. చదువు సాగించలేని పరిస్థితిలో ముష్టివాడిలా మీముందు చెయ్యి చాచాను. నాచెయ్యి ఖాళీగా వెనక్కి తీసుకున్నందుకు బాధపడలేదు. నన్ను హేళనచేసి అవమానించి మరీ పంపించారు. ఆ శంకరాన్నేనా నేను? ఈనాడు చదువుకుని - లాయరై డబ్బూ పేరూ సంపాదిస్తోంటే పిల్లనిస్తానంటూ వచ్చారా? అభిమానం వున్న ఏమనిషైనా ఈపరిస్థితిలో ఎలా ప్రవర్తిస్తాడో తెలిస్తే మీరిగడప ఎక్కేవారేకాదు... వేలూ ఎకరాలూ ఎర పెట్టి కొనేస్తారా నన్ను?...ఆనాడు నా చేతిలో ఒక్కరూపాయి డబ్బులు పెట్టి ఓదార్చి పంపించివుంటే... జీవితమంతా ఋణపడివుండేవాణ్ణి మీకు"

తిరపతయ్యకి మాట తిరగలేదు. ఏడుస్తోన్నట్టు నవ్వుతూ—"అది మరిసి పొమ్మన్నాను గదంటయ్యా? అప్పుడేదో... చేతిలో కానీ లేక... తర్వా

తెంత యిదయ్యానని అనుకున్నావ్? మణీ యాడ్డరు చేద్దామా అనుకున్నాను నామాట నమ్ము. అంతకోపం తెచ్చుకుంటే యలాగ చెప్పు," అన్నాడు.

"అబ్బే! మీమీద కోపం తెచ్చుకునే హక్కులేదు. మీ పిల్లని చేసుకునే అభిప్రాయమూ లేదు. మీ రేమనుకున్నా సరే, నే నేం చెయ్యలేను. ఏదో అభిమానంతో నన్ను చూట్టానికి వచ్చారని సంతోషించాను – నేను వెళ్ళాలి. కోర్టుకి టైమై పోతోంది;" నల్లకోటు చేతిమీద వేసుకుని తాళాలు ఆడిస్తూ గదిలోంచి బయటికి వచ్చేశాడు శంకరం.

తిరపతయ్య మొహం కళ మారి పోయింది. లేచి బయటికి వచ్చాడు. ఇద్దరూ గేటువరకూ ముభావంగా నడిచారు.

"వెళ్తానండీ! అందర్నీ అడిగానని చెప్పండి," అన్నాడు శంకరం విడిపోతూ.

తిరపతయ్య మాట్లాడ లేక పోయాడు. వెళ్ళిపోతోన్న శంకరాన్ని తెల్లమొహం వేసుకుని చూస్తూ నించున్నాడు.

*   *   *

కోర్టువారెంత ప్రయత్నించినా సావిత్రి మొగుడు– పెళ్ళాన్ని తీసికెళ్ళటానికి ఒప్పుకోలేదు.

"నా కిష్టంలేదు మా యిద్దరికీ పొత్తు కుదరదు అని తెగేసి చెప్పేశాడు

సావిత్రి ఏడుస్తోంటే శంకరానికి చిరాకేసింది. "మీకు విడాకులు తేలిగ్గా యిచ్చేస్తారు. అలాంటి దుర్మార్గుడితో ఇంకా సంబంధంకూడా ఎందుకు? పిటీషన్ పెట్టేస్తాను," అన్నాడు కోర్టు దాటి బయటికి వస్తూ... సావిత్రి తలాడించలేదు ఆఫీసు కొచ్చేవరకూ ఏడుస్తూనేవుంది – "బాబూ!. ఏనాడు పడిందో ఆ ముడి. తెంపుకుంటే తెగుతుందా? నా రాత మారితే ఆ మనిషి మనసే తిరుగుతుంది. అప్పుడే చేరదీస్తారు. విడాకు లెందుకులెండి. నా కేదో దారి చూడండి," అంది.

శంకరం నిర్ఘాంతపోయాడు. మాట్లాడలేకపోయాడు యిష్టం లేక పోయినా తనకి తను నచ్చజెప్పుకుని జవాబు చెప్పక తప్పలేదు. "చూడండి, మీ రేమీ అనుకోవద్దు మనోవర్తి యిప్పించమని అడిగితే పదో పరకో యిప్పిస్తారు. అంతకన్నా ఎక్కువ రాదు. అతనికి పెద్ద రాబడేం లేదు. వుద్యోగం లేదు. ఆస్తి లేదు. అందుకని మీకు చాలా తక్కువే వస్తుంది. కానీ..."

సావిత్రి దీనంగా శంకరాన్నే చూస్తూకూర్చుంది.

"ఆ డబ్బు తీసుకోవటానికి మీ కెలా




మనస్కరిస్తుందా?" తెల్లబోతూ అయోమయంగా అడిగాడు.

సావిత్రి తల కొంచెం పక్కకి తిప్పుకుంది. నేలచూపులు చూస్తూ ఎంత సేపటికీ మాట్లాడలేదు.

చూసి చూసి సావిత్రి జవాబు శంకరమే వూహించుకున్నాడు.

'ఎలా బాబూ? ఈపిల్లల్ని నే నెలా పెంచను? ఆడదాని బతుక్కి పౌరుషం కూడానా?' అంటుంది.

ఎదరగా సావిత్రి, భుజంమీదికి కొంగు లాక్కుని తల దించుకుని ముడుచుకు కూర్చుంది.

శంకరానికి పుట్టెడు జాలివేసింది సావిత్రిని చూస్తోంటే. మనస్సంతా కలవరపడి - దుఃఖం వచ్చేసింది.

"సరేనమ్మా! ఇదో పదో ఎక్కువ వచ్చేలాగే చేస్తాను. మీ రేం దిగులు పడకండి - భగవంతుడున్నాడు. నాలుగేళ్ళు కళ్ళు మూసుకుంటే మీ పిల్లలు పెద్దవాళ్ళయి చేతి కందుతారు. కష్టాలు కలకాలం వుండిపోవు," అన్నాడు గబగబా - సావిత్రిని ఓదార్చితేగానీ మనస్సు శాంతించలేదు.

సావిత్రికి పుట్టెడు ధైర్యం వచ్చింది. విప్పారిన కళ్ళతో తృప్తిగా చూసింది.

"జన్మజన్మలకీ మీ ఋణం తీర్చుకోలేను బాబూ!" అంది కళ్లొత్తుకుంటూ.

సావిత్రి వెళ్ళిపోయాక శంకరం కోర్టు డైరీ రాస్తూ కూర్చున్నాడు - రాస్తున్నాడేగాని బుర్రనిండా ఆలోచ

నలు విజృంభిస్తూ నిలకడ లేకుండా చేశాయి

*           *           *

సాయంత్రం సీనియర్‌తో వాదం పెట్టుకున్నాడు శంకరం.

"మొగుడు పెళ్ళాన్ని ఏలుకో నంటే ఏమీచెయ్యలేకపోయింది కోర్టు—అంతేనంటారా ?" అన్నాడు ఆవేశంగా.

"మ రేం చెయ్యా లంటావ్ ?"

"ఏం చెయ్యమని నే ననటం ఏమిటి? అదికూడా కోర్టే ఆలోచించాలి."

"అందుకేగా విడాకులో—పోషణో ఏదోఒకటి యిప్పిస్తోంది ?"

"ఆఁ, యిప్పిస్తోంది. సావిత్రిలాంటి అభిమానం లేనివ్యక్తి తప్పితే ఏ ఆడది ఈ ముష్టిపోషణకోసం దేవిరిస్తుంది ?"

"ఓయ్ పిచ్చివాడా ! ఆడవాళ్ళలో సగానికిపైగా సావిత్రిలాంటివాళ్ళే. మొగుడు వదిలేసినా ఫర్వాలేదు. ఇంత తిండి పెడితే చాలు."

"మీ రలా అంటే నేను వూరుకోనండీ ! అర్థంపర్థంలేని చట్టాలు చేసి ఆడవాళ్ళ కాళ్ళూ చేతులూ కట్టేశారు. పెళ్ళిమాట ఎత్తినదగ్గర్నుంచీ అన్నీ అవకతవకలే. కట్నాలు ఇవ్వకూడదన్నారు. పుచ్చుకోకూడదన్నారు. ఏమైంది ? ఇంకా ఎక్కువైంది. దర్జాగా ఆడపిల్లకి పదిమంది మధ్యనే తృణమో ఫణమో ఇచ్చుకోటానికిబదులు దొంగతనంగా లగ్నానికో నెల్లాళ్ళు ముందే అయ్యవార్లకి మూట లందించాల్సివస్తోంది. ఆడపిల్లకి నే నింత తెచ్చుకున్నా ననే ధైర్యం లేకుండాపోతోంది. 'వరకట్న నిషేధము' అంటూ వీళ్ళు చేసిం దేమిటి ? కట్నం ఇచ్చినవాడో—పెళ్ళికొడుకో—ఫిర్యాదు చెయ్యాలిట. చూడండి. ఎంత సొగసుగా వుందో ! కట్నం యిచ్చినవాడు కట్నం యిచ్చానని ఎప్పుడైనా చెప్తాడా ? రెంటికీ చెడ్డ రేవడిలా పిల్ల కాపరం పాడుచేసుకుంటాడా ? చట్టాలు చేయటమేగానీ — దాన్ని ఏ పద్ధతిలో ఖచ్చితంగా అమలు పర్చాలో ప్రభుత్వం ఆలోచించద్దూ ? ఒక పెళ్ళి జరిగిందంటే అందులో వరకట్నం అనేది ఇవ్వబడిందా ? లేదా ? అనే సమాచారాన్ని ప్రభుత్వం సేకరించనేలేదా ? ఎక్కడో రహస్యంగా ఖూనీలు జరిగితే వూరుకుంటోందా ? నానా హైరానాపడి ఖూనీ చేసినవాణ్ణి పట్టుకోవటంలేదూ ? అలాగే ఈ వరకట్నాల విషయంలోకూడా ఏ మేజిస్ట్రేట్‌కో, జడ్జికో కాగ్నైజన్స్ ఎందుకివ్వకూడదు ? ఏం చెయ్యాలో అది మానేసి — 'వరకట్న పిశాచిని పారద్రోలండీ' అంటూ ప్రతీ వెధవా వెర్రిమొర్రి వుపన్యాసా లిస్తే ఏం సాధించినట్టు ? ప్రభుత్వం యి దెందుకు ఆలోచించదో చెప్పండి ముందు;" బల్లమీద




ఒక్కగుద్దువేసి ఖరాగా తేచీనించున్నాడు శంకరం.

సీనియర్ నవ్వుతూ – "నీ ఆర్గ్యుమెంటంటే నాకూ చాలా యిష్టం. పూర్తిగా కానీ – తర్వాత నేను మాట్లాడతానుకూ. ఊఁ, చెప్పు చెప్పు," అంటూ సోఫాలో వెనక్కి వాలి కూర్చున్నాడు.

శంకరం సూటిగా చూస్తూ – "చెప్పటం కాదండీ! నే నేదో కేసు కోసం ఆర్గ్యూ చెయ్యటం లేదు. నిజంగా నేను ఫీలౌతోందంతా చెప్తున్నాను. చట్టాలుమాత్రం అదు క్కొకటీ–ఆంగు శాని కొకటీ వున్నాయ్. తాగకూడదు, జూదమాడకూడదు, వ్యభిచరించకూడదు, రెండో పెళ్ళి పనికిరాదు, కట్నాలు తీసుకోకూడదు, లంచాలు పట్టకూడదు. ఒహోహో! అన్నీ శాసనాలే, అన్నీ ధర్మపన్నాలే? ఎందుకూ? ప్రజల నెత్తిన మోదడానికా? నోరు నొక్కటానికా? ఎందు కంటున్నాను. ఏది అమలు జరుగుతోందంటున్నాను."

సీనియర్ మందహాసం చిందించాడు.

"సరే! కట్నమిచ్చి – పిల్ల నిచ్చి – కాళ్ళు కడిగి – మరీ పెళ్ళి చేస్తారు. ప్రతీ వాడినీ ఓ హీరోని చేసి కన్యాదానం చేస్తారు. అప్పట్నుంచే వాడికి కొమ్ములు మొలవటం మొదలు. కోతికి కొబ్బరి కాయ దొరికినట్టు వాడికి పెళ్ళాం దొరుకుతుంది – కొట్టటం — తన్నటం – పొడవటం – చివరికి చంపటం – సర్వ

హక్కులూ వాడివే. కన్యాదానం పట్టిన మహానుభావుడాయె!

సావిత్రి మొగు డేంచేశాడు? పిల్లల్ని కని - పెళ్ళాన్ని వదిలేస్తాడా? ఇప్పుడు నా కిష్టంలేదంటాడా? పెళ్ళాం పిల్లలకి ఒక్కపూటకు కూడా చాలీ చాలని ముష్టి పడేస్తాడా? దర్జాగా స్వతంత్రంగా హాయిగా తిరుగుతూ జీవితం గడిపేస్తాడా? ఈ పిల్లలేమైపోతారు? తల్లి పెంచుతుందా? ఎలా పెంచుతుంది? వాడు తాళి కట్టి నాశనం చెయ్యబట్టికదూ, ఆమె జీవితం యిలా అయింది? పెళ్ళికి అర్థం తెలియని వెధవ - భార్యకి విలువయివ్వని దౌర్భాగ్యుడు - అసలు పెళ్ళెందుకు చేసుకున్నాడు? పిల్లల్నెందుకు కన్నాడు? - ఈ బాధ్యతలన్నీ ఒంటరిదానిమీదికి తోస్తాడా? ఇదేనా కోర్టుచెప్పిన న్యాయం? సావిత్రి మొగుడు చేసిన నేరం - ఒక ఖూనీనేరం కన్న చిన్నదా? ఇలా ఎంతమంది ఆడవాళ్ళని వుంచుకుంటాడు? ఎంత మందిని యిష్టంలేదని వదిలేస్తాడు. చేస్తోంది నేరంకాదా? వాణ్ణి శిక్షించే బాధ్యత ప్రభుత్వానికి లేదా? మరి ఎందుకు వదిలేసింది?'' శంకరం ఒక్క క్షణం ఆగి 'సీనియర్'ని తీక్షణంగా చూశాడు.

—"సావిత్రి కేంన్యాయం జరిగింది? అసలు జరిగింది న్యాయమేనా అని? న్యాయమని చెప్పటానికి మనకి సిగ్గువెయ్యటంలేదా? ప్రభుత్వం స్త్రీ హక్కులకోసం - స్త్రీ సంక్షేమం కోసం పాటు పడుతోందా? అవి రామంగా శ్రమిస్తోందా?

తిండీ గుడ్డా తప్పితే ఏమీ కోరని అమాయకురాలిని దారుణంగా అన్యాయానికి గురైన ఒక ఆడదాన్ని - ఒక దౌర్భాగ్యురాలిని - ఒక అనాధ స్త్రీని ఆదుకోలేని ఈ ప్రభుత్వం, అసలు దాంపత్య జీవితాల్లో ఎందుకు తల దూర్చింది? భార్యా భర్తల్ని ఎందుకు కోర్టుకు లాగింది?

సావిత్రి మొగు డొదిలేశాడని పుట్టినూరు వచ్చేస్తే అందరూ ఏమన్నారో తెలుసా? - 'కోర్టుకి వెళ్ళు, ఆ వెధవకి బుద్ధిచెప్తారు. నీకు న్యాయం చెప్తారు' అన్నారు. ఇది కోర్టు ప్రజల్ని పెడదారి పట్టించటంకాదూ?'' — కొంచెం ఆగాడు శంకరం.

— "అసలు ప్రభుత్వం కొన్ని పనుల్లో తల దూర్చకుండా వుంటే - ఇవ్వాళ సావిత్రి కెట్టి న్యాయం జరిగేదో తెలుస్తుంది?

తనకింత కష్టం వచ్చిందని కావలసిన వాళ్ళందరి దగ్గిరా గోల పెట్టింది. మనిషన్నవా డెవడూ స్వతహాగా వాడెంత వెధవైనా మిగతా వెధవల విశృంఖలత్వాన్ని సహించడు.

సావిత్రి మొగుణ్ణి పెద్దమనుషుల మధ్య కీడ్చుకొచ్చేవారు. వాళ్ళకి




తోచింది న్యాయం! చెప్పింది శాసనం! పిచ్చిపిచ్చి చట్టాలులేవు. తలాతోకాలేని కుతర్కాలులేవు. కోర్టునిబంధన లసలే లేవు – వాడీచుట్టూ చేరి దుయ్యబట్టి– కాకుల్లా కళ్ళుపొడచి – అవసరమైతే నాలుగు రుచి చూపించి – జీవితంలో మరీ పిచ్చివేషా లెయ్యకుండా – తలెత్తుకు తిరక్కుండా – ఏది సబబని తోస్తే ఆ పరిష్కారం చేసేవారు. ప్రతీ మనిషి సావిత్రికి అండగా నిల్చేవాడు. ఇప్పుడా అవకాశంలేదే! కోర్టు... కోర్టుందిగా? న్యాయాలు చెప్పే కోర్టుందిగా? శిక్షలువేసే కోర్టుందిగా? కోర్టున్యాయం రుచి చూద్దామని కోర్టుకి వస్తారు అమాయకులు. నన్నెలా సమర్థించుకో మంటారో చెప్పండి మీరు."

శంకరం మొహమంతా చెమటలు పట్టింది. కళ్ళు జ్యోతుల్లా అయ్యాయి. దాదాపు కంఠం పూడుకొచ్చింది. సీనియర్ని సూటిగా చూస్తూ నిలబడ్డాడు – సీనియర్ చెక్కుచెదరని మందహాసంతో – "శంకరం! అన్నీ తెలిసి ఆవేశంలో పడుతున్నావు. అన్యాయంగా కోర్టుల్ని తిడతావెందుకోయ్?

ప్రభుత్వం విధించిన శాసనాల్ని అక్షరాలా అమలుజరపటం కోర్టుపని. కోర్టుకి వ్యక్తిత్వంగానీ స్వతంత్రంగానీ లేవు. నీకు ఓపికున్నంత వరకూ –

చేతనైనంతవరకూ ప్రభుత్వాన్నే అను. ఈ సాయంత్రంవేళ తృప్తిగా వింటూ ఆనందిస్తాను. పోనీ నువ్వు కాస్సేపు రెస్ట్ తీసుకో, నేను అంటాను."

శంకరానికి కోపం వచ్చింది. ఎర్రగా చూస్తూ అన్నాడు– "మీ రెందు కింత తేలిగ్గా తీసుకుంటున్నారు? న్యాయవాదులం అని బోర్డులు కట్టుకుని – కోర్టులచుట్టూ తిరగటమేనా మనపని? ఒక అన్యాయాన్నిగురించి మీ రెప్పుడూ ఆలోచించలేరా?"

సీనియర్ నవ్వుతూనే శంకరాన్ని అభిమానంగా చూస్తూ – "శంకరం – ముందు నువ్విలా కూర్చో. చూడబ్బాయ్! నువ్వు చిన్నవాడివి. అందుకే నువ్వు ఏ అధర్మాన్నీ సమర్థించుకోలేవు. నాకీవృత్తిలో తల పండిపోయింది – నీకు తెలుసుగా? కొన్ని వందల కేసుల్లో నీలాగ నేనూ బుర్ర బద్దలు కొట్టుకున్నాను. ఏం లాభం? నా జీవితం అయిపోయింది. కొన్నాళ్ళకి నీ జీవితమూ అయిపోతుంది. ఆవేశపడి సాధించే దేమిటి? 'లా' చేతిలో, ఆ కబంధహస్తాల్లో వున్నాం మనం. అందుకే ఈ 'లా' చేసేవాళ్ళని అనమని మొదటే చెప్పాను నీకు.''

శాంతించినట్టు చూశాడు శంకరం.

"ప్రభుత్వం గుడ్డిదన్నావ్, బుర్ర లేదన్నావ్, కాళ్ళూ చేతులూ–ముక్కూ మొహం ఏమీ లేవన్నావ్. అంతవరకూ నాకూ నచ్చింది. ప్రభుత్వానికి యింకా ఏవేవో వున్నాయని నీ అభిప్రాయం. అయితే అది నాకేం నచ్చలేదు. ఈ న్యాయచట్టాల్ని ఎవరు తయారు చేస్తారో నీకు తెలియందిఏముంది? మన శాసనసభ్యులు – పార్లమెంటు మెంబర్లు. వింటున్నావా? 'మన దేశం! భారతదేశం!' అని నోటితో అరిచి నొసలుతో వెక్కిరిస్తూ, దేశాన్ని కొల్లగొట్టి స్వంత ఖజానాలు నింపుకునే బురఖారాయుళ్లూ! ఎంత పిండుకున్నా తృప్తితీరక పొదుగు కోసి మరీ పాలుతాగే ప్రజాసేవకులూ!

కానీ వీళ్ళు చేస్తోం దేమిటి? వెళ్ళటం మాత్రమే ప్రజల్లోంచి. మళ్ళా ప్రజల మొహం చూడరు. ప్రజల సుఖదుఃఖాలు ఆలోచించరు. వాళ్ళ స్వంతానికి – ముఠా శ్రేయస్సుకి ఏ శాసనం చేస్తే అనువుగా వుంటుందో ఆ శాసనాలు తయారుచేసుకుంటారు అవి ప్రజల్ని ఎంతవరకూ వుద్ధరిస్తాయో వాళ్లు ఆలోచించరు. ఇప్పుడు తయారు చేస్తోన్న చట్టం రేపు అమల్లోకి వస్తే ఎలాంటి సాధకబాధకా లెదురవుతాయో వూహించలేరు. వాళ్ళకి సబబుగా వుందనిపిస్తే చాలు, ఓటింగుకు పెట్టిస్తారు. ఎక్కువ మంది అవునంటే









---

అవును, కాదంటే కాదు. ఆ మందిలో అనేక రకాలవాళ్ళు వుంటారని మర్చిపోకు. వాళ్ళ సొంతవూరు దాటి బయటికొస్తే తూర్పేదో పడమరేదో తెలీదు. మీటింగుల కొచ్చి మాటా మంచీలేకుండా బిక్కచచ్చి కూర్చుంటారు. అలాంటివాళ్ళంతా బయల్దేరి మన న్యాయసూత్రాలు తయారు చేస్తున్నారంటే ఎంత హాస్యాస్పదంగా ఎంత జుగుప్సాకరంగా వుందో ఆలోచించు;'' నిర్వికారంగా చూశాడు సీనియరు మధ్యలో ఆపి - "ప్రభుత్వం చేసిన చట్టాన్ని మర్నాటినుంచీ అమలు జరపాలి కోర్టు."

చంటిపిల్లాడు వందోసారో వెయ్యోసారో ఏడు చేపలకథ వింటోన్నంత అసక్తిగా విన్నాడు శంకరం - "దీని కిక విముక్తి లేదంటారా?'' అన్నాడు ఆశాభావం తొణికిస్తూ.

సీనియర్ ఆవలిస్తూ కుర్చీలో వెనక్కి వాలి పడుకున్నాడు - "రాజు గారు తల్చుకోవాలి నాయనా! మనం అరవాలి - అరుస్తోనే వుండాలి. అది రాజుగారికి వినపడుతోందనే ఆశతో జీవితమంతా అరుస్తోనే బ్రతకాలి. అరిచి చెప్పాంకదా అన్న తృప్తితో చావాలి.'' లేచి తిన్నగా కూర్చున్నాడాయన - "విముక్తి ఎందుకు లేదోయ్? చెయ్యాలంటే ఎంతైనా వుంది.

మనది ప్రజాస్వామ్యం. ప్రజలే

పాలకుల్ని ఎన్నుకునే దేశం. మన యిష్టా యిష్టాల బలంతో ప్రభుత్వాన్ని నిలబెడతాం. ఇలాంటి దేశంలో ప్రభుత్వాన్ని స్థాపించే ప్రజలకి ఎంత బాధ్యత వుండాలో ఆలోచించు. ఓటు అంటే ఏమిటో తెలిసి - దాని విలువ గుర్తించి - దాన్ని సద్వినియోగం చేసే వివేకం వుండాలి ఓటర్లకి. అది ఎలా వస్తుంది? చదువు - రాజకీయ పరిజ్ఞానం.

ఓ పావలా కల్లుకీ - అర్ధరూపాయి మాంసానికీ ఓటు అమ్ముకునే ఓటర్లు కొల్లలు. ఓటు ఎలా వెయ్యాలో తెలీక - చెప్పినా బోధపడక ఓటు ఇన్‌వాల్యూడ్ చేసే ఓటర్లెంతమందో వూహించలేం. పిచ్చివాడి చేతికి కత్తి యిస్తే ఏం జరుగుతుందో, అలాగేవుంది మన వయోజన ఓటింగు హక్కు. పేరంటానికి కూడా అందర్నీ పిలవరే! ప్రభుత్వాన్ని స్థాపించటానికి మాత్రం వచ్చేపోయే ప్రాణాలతో మతి తప్పి మూల పడుకున్న ముసలమ్మకికూడా హక్కుంది. అలాంటి స్థితిలో వున్న ముసలమ్మ ఎంత బాధ్యతతో ఎంత వివేకంగా ఓటు చేస్తుందో మరి భగవంతుడికే తెలియాలి. ఇలాంటి రకమైన ఓటర్లంతా ఎన్నుకున్న ప్రజాప్రతినిధులమీద మనకుమాత్రం పెద్ద పెద్ద ఆశ లెందుకూ? వాళ్ళు తయారుచేసే శాసనాలగురించి ఈ తర్కా లెందుకు? శుద్ధ దండగ,''- నిరాశతో వెనక్కి జారబడి పడుకున్నాడు సీనియరు. రెండు నిముషాలు కళ్ళు మూసుకుని నిశ్శబ్దంగా కూర్చున్నాడు. చటుక్కున కళ్ళు తెరిచి శంకరంకేసి చనువుగా చూస్తూ అన్నాడు -

"మనకి స్వరాజ్యం వచ్చినప్పుడే చెప్పాడోయ్ రాజేంద్ర బాబు. విన్నాడుకాడు నెహ్రూపండితుడు. "నా దేశం, నా ప్రజలు అనే అభిమానంలో మునిగి మన గొర్రెలమంద అర్హతలను గుర్తించలేక పోయాడు. దేశానికి జరిగిన మొట్టమొదటి అనర్థం యిదే."

ఒక్క నిముషం ఆగి మళ్ళా అన్నాడు - "అన్నివిధాలా గొప్ప వనుకున్న దేశాల్లోనే నిన్న మొన్నటి వరకూ అందరికీ ఓటింగు హక్కు లేదు. వాళ్ళను మనం అనుకరించాలా అంటావేమో? అదికాదు నే చెప్పేది. మన విద్యా ప్రమాణాలు పెరిగి - నూటికి తొంభై మందైనా చదువుకున్నవాళ్ళుంటే - అప్పు డందరికీ ఓటింగుహక్కు యిస్తే ఎవడు కాదంటాడు.

ఇప్పటికైనా... మనం బాగుపడాలంటే మొట్టమొదట ఈ వయోజన ఓటింగుహక్కు రద్దు చెయ్యాలి. కనీసపు క్వాలిఫికేషన్ లేని వ్యక్తికి ఓటు

చేసే అధికారం వుండకూడదు. అలాగే అసెంబ్లీకీ - పార్లమెంటుకీ - నిలబడే మెంబర్లకికూడా ఏవో క్వాలిఫికేషన్లు నిర్ణయించాలి. అలా అయితే కొంత తాహతు కలవాళ్ళే దేశాన్ని పాలించటానికి పైకొస్తారు... ఇంతకీ మనం చట్టాల విషయం మాట్లాడుకుంటున్నాము కదూ ?- అవునోయ్ ! ప్రభుత్వము చట్టాలు తయారు చేసేప్పుడు రాష్ట్రాల్లోనూ - దేశంలోనూ న్యాయవాదులతోటీ న్యాయమూర్తులతోటీ సంప్రదిస్తే - బార్ అసోసియేషన్స్ యిచ్చే సలహాలు పరిశీలిస్తే లాభమే గానీ నష్టం వుండదే! చట్టాన్ని అమలు పర్చేప్పుడు ఎలాంటి అవకతవకలూ రావే ! అలా అయితే ..."

"చాలా బావుంటుందండీ!'' ఉత్సాహపడ్డాడు శంకరం.

"కొంతైనా బావుంటుందని నా అభిప్రాయం;" దృఢంగా అన్నాడు సీనియరు – "నేరస్థులు తప్పించుకుపోగే అవకాశా ల్లేకుండా చట్టాన్ని అమలుచేసే పద్ధతులు వుత్తమంగా తయా రౌతాయి. న్యాయసూత్రాలు పదునెక్కి నేరాల్ని మార్చేస్తాయి. అప్పుడు న్యాయశాస్త్రాన్ని నూటికి నూరుపాళ్ళూ పాటించ గల్గుతుంది కోర్టు."

"కానీ... అబ్బే ! ఇదంతా జరిగేది కాదండీ ! మనం కలలు కంటే ఏం లాభం ? ఈ గుడ్డిదర్బా రిలా సాగాల్సిందే.''

నిరుత్సాహ పడిపోయాడు శంకరం.

సీనియరు శంకరాన్ని వాత్సల్యపూరితంగా చూస్తూ అన్నాడు - "శంకరం! మనం బొత్తిగా పొట్టకూడే దృష్టిలో పెట్టుకుని ఫీజులు నొల్లుకోటానికే అంకితమై పోకూడదోయ్ ! ప్రజలకి సేవ చేసే బాధ్యత వుండేది మొట్టమొదట వుపాధ్యాయుడికీ - రచయితకీ. ఇలా కొంత మందే ఈ ప్రజాస్వామ్యంలో ఎప్పటికప్పుడు ప్రజల హక్కులకోసం పోరాడి - వాటిని రక్షిస్తూ వుండాలి. ప్రభుత్వాన్ని-సద్విమర్శలతో మార్చి, పోట్లు పొడుస్తూ సన్మార్గంలో నడవమని హెచ్చరికలు చేస్తూవుండాలి.

అనుభూతి చెందగలిగేవాడికి ఇది ఎంత పవిత్రమైన కర్తవ్యమో తెలుసా? ఉన్నారు నాయనా ! నీలాంటివాళ్ళు అరుదుగానైనా వున్నారు. అదే నాకు తృప్తి. దేశం ఎప్పుడూ గొడ్డుపోదు."

శంకరం మరేమీ తర్కించలేదు. మనస్సెంతో తేలికపడింది. ఎందుకో దర్పం కలిగింది - ఫైల్ మూసి డ్రాయర్‌లో పెడుతూ-''వెళ్తానండీ" అన్నాడు.

(సశేషం)

బ్రాసల్‌పూర్ మీదుగా జయచండీ ఆలయానికి వెళ్ళే రోడ్డుమీద, ఊరిచివర ఘోషాల్‌వాళ్ళ ఇల్లున్నది. ఇంటిపెద్ద నిభానని. ఆమె కొడుకు శశిధరుడు; కోడలు వాసంతి. వాళ్ళకు పిల్లలు లేరు. నిభానని కూతురు సుధాముఖికూడా పుట్టింటనే ఉంటున్నది; ఆమె భర్త గౌరాంగుడు; ఇల్లరికపు టల్లుడు; వాళ్ళకొక కొడుకున్నాడు; వాడిపేరు బాదల్.

ప్రస్తుతం వాళ్ళింటిముందుండే రోడ్డుమీదుగా జనం తీర్థప్రజగా వస్తూపోతూ ఉన్నారు. ఎందుకంటే చండీ ఆలయందగ్గిర ఒక అపర మహావిష్ణువు వచ్చి ఉన్నాడు. అయిదు కానులూ, తాంబూలాలూ ఇచ్చినవారికి భూతభవిష్యత్తులు చెప్పే స్తున్నాడు. ఈ అపర శ్రీమన్నారాయణుడి దర్శనం చేసుకోవటానికీ, తమతమ అభీష్టాలు నెరవేర్చుకోవటానికీ అనేక గ్రామాలనుంచి జనం తండోపతండాలుగా వెళుతున్నారు.

ఎంతమంది స్త్రీలు అపరనారాయణుడి దర్శనం చేసుకున్నా వాసంతిమాత్రం అందుకు నోచుకోలేదు. తన భార్యగాని, చెల్లెలుగాని చండీతలాకు వెళ్ళరాదని శశిధరుడు తీవ్రంగా శాసించాడు. ఆ శాసనాన్ని సుధ ధిక్కరించవచ్చు; కాని వాసంతి ధిక్కరించలేదు.

సుధ వెళ్ళనేవెళ్ళింది. నారాయణమూర్తి అవతారాన్ని మూడు ప్రశ్న లడిగిరావటానికి రెండణాల డబ్బు లివ్వమంటే తల్లి ఇవ్వలేదు; వదినె వాసంతి ఇచ్చింది. తన కొడుకు డబ్బంతా తీసుకొచ్చి పెళ్ళాం కొంగున మూట గట్టుతున్నాడని నిభానని రుసరుసలాడింది.

ఆడబిడ్డ వెళ్ళాక వాసంతి తహతహ మరింత అయింది. ఆమెకు భవిష్యత్తు తెలుసుకోవాలని మహాఉన్నది. భర్తా, అత్తగారూ, ఆడబిడ్డా – వీళ్ళమధ్య ఆమె నలుగుతూ అంధకారమయజీవితం జీవిస్తున్నది. అత్తగారు అడుగడుగునా ఆంక్షలు పెడుతుంది; ఆడబిడ్డకు వల్లమాలిన ఈర్ష్య; మొగుడు అస్తమానమూ కటువుగా మాట్లాడతాడు. అతనికి అనుమానంకూడా జాస్తి. అత్తగారు నిభానని కావాలన్నా మరొకవిధంగా ప్రవర్తించలేదు. ఆమె కుసంస్కారంలో పెరిగి, అత్తగారు కోడలిపట్ల ఎలా ఉండాలో నేర్చుకున్నది. సుధనుకూడా తప్పుపట్టి లాభంలేదు. ఆమె భర్త అప్రయోజకుడు. బిడ్డతోసహా పుట్టింట పడిఉండటం ఏ ఆడదానికైనా తలవంపులే.

తన భర్తనే వాసంతి అర్థంచేసుకోలేకుండా వున్నది. ఆమె పేదయింటి పిల్ల. కాపరానికి వచ్చింది లగాయతూ బానిసలాగా చాకిరీ చేస్తున్నది. అయినా శశిధరుడికి

తాను ఆమెకు తగనన్న శంక ఏమూలో ఉన్నట్టున్నది. అందుకు కారణం వాసంతి చాలా అందగత్తె కావటమేనేమో.

సుధ మొగుడు గౌరాంగుడు పేరుకుతగ్గట్టే మంచి శరీరచ్ఛాయ కలిగి, అందంగా కనబడేవాడు. కాని పరమమూర్ఖుడు. ఏ పనికీ కొరగాడు. అతని రంగూ, రూపమూ చూసి విభావరి కూతురినిచ్చి చేసింది. కాని అతను ఎర్రఏగానీ సంపాదించలేదు. సంపాదించలేనందుకు సిగ్గుపడడు. అవమానంగా మాట్లాడినా అభిమానపడడు. అస్తమానమూ పాడుకుంటూ, తన ఆనందంలో తానుంటాడు. తబలా దొరికితే వాయిస్తాడు. అతనికి నాటకాల పిచ్చి. అందుకుగాను అతను ఆ చుట్టుపక్కల ఉండే కుర్రకారును చేర్చి ఒక సమాజం ఏర్పాటుచేశాడు ఉన్నట్టుండి అతను కనపడకుండా పోతాడు. అతను ఎంతకూ భోజనానికి రాకపోతే అతన్ని వెతకటానికి శశిధరుడు వెళ్తాడు. విభావరి వెళుతుంది. నాటకసమాజపు కుర్రాళ్ళందరినీ దుమ్మెత్తిపోసి వస్తుంది. "వాడి చావుకబురు వింటే దేవుడి కో కొబ్బరికాయ కొడతా," అంటాడు శశిధరుడు. సుధ ఏడుస్తూ కూర్చుంటుంది. ఒకవంక మొగు దేమయాడోనని దిగులు పడుతూనే, తనని అలాటివాడి చేతిలో పెట్టినందుకు తల్లిని తిట్టిపోస్తుంది. తరవాత వీధులన్నీ కలయతిరిగి వస్తుంది. ఆమెది తిరిగే కాలూ, తిట్టే నోరూనూ.

ఇదంతా ఎప్పుడో ఒక్కసారి జరిగినది కాదు, అనేక పర్యాయాలు జరిగి అలవాటై పోయినది. అయిపూ అజా లేకుండా వెళ్ళిపోయిన గౌరాంగుడు హఠాత్తుగా తిరిగివచ్చి పులగం వండిపెట్టమని భార్యను ఆజ్ఞాపిస్తాడు అప్పుడు సుధకు మరేదో పెట్టాలనిపిస్తుంది. అయితే, వంటిల్లు వాసంతి అధీనంలో ఉంటుంది గనక గౌరాంగుడి కోరిక తీరుతుంది.

నిజానికి వాసంతికి గౌరాంగుడంటే ఆదరం ఉన్నది. తనకన్న నాలుగేళ్ళు పెద్దవాడే అయినా ఆమెకళ్ళ కతను పెరిగిపోయిన పాపాయిలాగా కనిపిస్తాడు. గౌరాంగుడికికూడా వాసంతి అంటే అభిమానమే.

శశిధరుడికి శిరస్తాలో ఉద్యోగం; పొద్దున వెళ్ళి మధ్యాహ్నం వస్తాడు. అన్నం తిని, కాస్సేపు విశ్రాంతి తీసుకుని, మళ్ళీ అపరాహ్ణం వెళతాడు.

ఒకరోజు ఉదయం అతను బయలుదేరబోతుండగా వాసంతి, "ఆడబిడ్డ మొగుడు ఇంటికి వచ్చి పదిరోజు లయింది," అన్నది.

శశిధరుడు భార్యను అసహ్యంగా చూసి, "ఏం, ఆడబిడ్డ భర్తకోసం అంత ఆరాటపడుతున్నావు ?" అన్నాడు.

వాసంతి ఇలాంటి పోట్లకు అలవాటుపడిపోయింది, "నాకైతే ఆడబిడ్డగాని మీకు తోబుట్టువేగా ? ఆమెకోసమైనా అతన్ని వెతకరాదూ ?" అన్నది.



"దానికి నీ కున్నంత బెంగ లేదులే. వాళ్ల పామూ, ముంగిసానూ," అన్నాడు శశిధరుడు.

"పొరబాటు మీకు ప్రేమంటే ఏమిటో తెలియదు."

"ఎందుకు తెలియదూ ? ప్రేమంటే భర్తను కాదని పరాయివాడికోసం పడి చావటం !'' అంటూ శశిధరుడు వెళ్ళిపోయాడు.

ఆ తరువాతనే సుధ అపర నారాయణమూర్తిని చూడబోయింది. నిభానని పెత్తనాలకు వెళ్ళింది వాసంతి వేరే పనేమిలేక పూలమొక్కలకు పాదులు సరిచేస్తుండగా గౌరాంగుడు, భుజాన ఒక హార్మోనియం పెట్టుకుని, ఒక చేత తాడున గుచ్చిన చేపను పట్టుకుని దిగాడు.

"ఇల్లు నిశ్శబ్దంగా ఉంది; అత్తగారు ఇంటో లేరా ?" అని అత నన్నాడు.

"ఇన్నాళ్ళూ ఎక్కడి కెళ్ళారూ ?" అని వాసంతి ఎదురడిగింది.

అంతలోనే నిభానని వచ్చింది "ఇదేం కొత్తా ఏం ? బావమరి దింట తేరతిండి ఉంది ! బావమరిది పెళ్ళాం చనువు చేస్తుంది !" అంటూ, ఆమె అతని చేతిలోని చేపను ఈసడింపుగా చూసి కోడలితో, "పదిరోజులు అయిపులేకుండా పోయి,

బాబుగారు ఒక చేపను లంచంగా తీసుకొచ్చారు ; ఇప్పుడే చెబుతున్నా - దాన్ని ముట్టుకునేవు. ముట్టుకుంటే ఒట్టే !" అన్నది.

వాసంతి బుగ్గన వేలేసుకుని, "పుటిక్కైన ఒట్టేశారేమి టత్తయ్యా! ముత్తయిదువు లున్న ఇంటో చేపను తిప్పికొట్టొచ్చా ?" అన్నది. ఈమాట నిభానవిమీద బ్రహ్మాస్త్రంలాగా పనిచేసింది తన ఒట్టు అల్లుడికి తగిలినా ఆమెకు పర్వాలేదేమో గాని కొడుక్కే తగిలితే ?

"నీకు తెలుసుగా? నాకు కోపం వస్తే ఒళ్లు తెలీదుమరి పెట్టిన ఒట్టు పోదుగా?" అన్నది నిభానని వెళ్ళిపోతూ

"ఆ ఒట్టు నీకేగాని, నాకు కాదుగా ? కత్తిపీట ఇలా ఇయ్యి చెల్లెమ్మా !" అన్నాడు గౌరాంగుడు

"ఇంకా నయం ! మగవాళ్ళు చేపను తరగటమా ? మా ఆడబిడ్డ వచ్చి దాని సంగతి చూస్తుందిలెండి," అన్నది వాసంతి.

గౌరాంగుడు హార్మోనియం వాయిస్తూ పాట పాడతానని చెప్పి, వాసంతిని కూర్చుని వినమన్నాడు. వాసంతి గుండె గుభేలుమన్నది. శశిధర్ వచ్చేవేళ. తప్పించుకోవటానికి ఆమె ఏమేమో చెప్పింది. హార్మోనియము "డొక్కు" అన్నది. అట్లా అనటానికి వీల్లేదనీ, పదిరోజులు తిష్ఠవేసి, గొంతుమీద కూర్చుంటే గాని గోవర్ధనఅధికారి దాన్ని తనకు ఇవ్వలేదనీ అత నన్నాడు. తనకు బోలెడంత పని ఉన్నదనీ, సుధ తిరిగివచ్చి అతని పాట వింటుందనీ ఆమె అన్నది. పాట వింటే సుధకు ఆపలింతలు వస్తా యన్నాడు గౌరాంగుడు. ఇద్దరూ నవ్వుతూ ఈ ధోరణిలో మాట్లాడుతుండగానే శశిధరుడు వచ్చి గుమ్మంలో నిలబడ్డాడు. అతను రావడం గమనించని వాసంతి అతన్ని చూడగానే కొయ్యబారిపోయింది.

అతను భార్యకేసి కొరకొరా చూసి, పైబట్ట ఆమెచేతి కివ్వకుండా తానే చిలక్కొయ్యకు తగిలించి, గౌరాంగుడి కేసి తిరిగి, "ఇంక తేరతిండి దొరకలేదా ఏం ?" అన్నాడు

"తిండికేం కావలసినంత ! కాని ఏపూట ఎక్కడ రాసిపెట్టివుంటే అక్కడే తింటాం," అన్నాడు గౌరాంగుడు.

"ఈ మిట్టవేదాంతాని కేంలే ఇది మర్యాదస్తుల ఇల్లు. గానాబజానాల కొంప కాదు నీ దరిద్రపు వేషా లిక్కడ వెయ్యకు," అంటూ శశిధరుడు హార్మోనియమును కాలితో తోసి అవతలికి వెళ్ళిపోయాడు.

అన్నంముందు కూర్చున్నాక శశిధరుడి మనసు కాస్త మెత్తబడింది. "ఆ దంష్ట్రాగ్యుడు తిన్నాడా," అని అడిగాడు. "ముందుగా పెట్టెయ్యకపోయావా," అన్నాడు.

"అతనికోసం వేరేఅన్నం పొయిమీది కెక్కించా," నన్నది వాసంతి.

"నువుకూడా తినలేదు గామాలు ?" అన్నా డతను.

"నా నైవేద్యం ముందే చేసుకున్నాగా !" అన్నది వాసంతి వెటకారంగా.

తనతో ఏకాంతంగా భార్య పరాచకాలాడటం అతనికి సంతోషమే. అతను ముసిముసి నవ్వుతో, "అబ్బో, ఎంత పతిభక్తి !" అన్నాడు.

వాసంతి భర్తముఖంలోకి చూస్తూ, "నా పతిభక్తిలో లోపం ఏమైనా కనిపించిందా ?" అని అడిగింది

"కనిపించకేం ? నా కేది అసహ్యమో అందులోనే నీ కానందం. ఇది పతివ్రత లక్షణమా ?"

"మీ కిష్టం లేదనేగదా, అందరూ దర్శనం చేసుకొస్తున్నా, నేను చండీతలాకి వెళ్ళి చతుర్భుజస్వామినికూడా చూసిరాలేదు ?''

"చతుర్భుజస్వామి ! అపరనారాయణమూర్తి ! అంతా మోసం ! రబిష్ !"

భర్త నాస్తిక సంభాషణ విని వాసంతి బెదిరిపోయింది "అసలు మీబెంగ అదికాదు. అందరి పెళ్ళాలనూ ప్రపంచం చూడవచ్చుగాని, మీపెళ్ళాన్ని ఎవరూ చూడకూడదు ! ఆవిడ స్వర్గంనుంచి ఊడిపడిన రంభ !" అన్న దామె

"ఆమాట రైటు ! భార్య రూపవతి కావటం ఎంత బాధో తెలుసా ?'' అన్నా డతను, భార్య బుగ్గ మీటుతూ.

"అలా అయితే మంగలిరామి మనమరాల్ని చేసుకోలేకపోయారా ?''

శశిధరుడు భోజనం పూర్తిచేసి లేచివెళ్ళి సుఖంగా నిద్రపోదామని పడుకున్నాడు. ఇంతలో అవతలినుంచి మాటలు వచ్చి బాణాల్లాగా గుచ్చుకున్నాయి.

''మీ శరీరం బంగారంలాగా మెరిసిపోతున్నది. ఈ రూపాన్ని చూడటానికి మా ఆడబిడ్డ లేకపోయిందిగద ! సబ్బురుద్దుకుని స్నానం చేశారా ఏం ?'' అంటున్నది వాసంతి, అప్పుడే స్నానం చేసివచ్చిన గౌరాంగుడితో.

గౌరాంగుడు నవ్వుతూ, "మీ ఆడబిడ్డ, నేను సబ్బురుద్దుకు స్నానం చెయ్యగా కూడనేలేదంటారాఏం ? ... కాస్త ఈ బ్రాహ్మడికి తిండిపడెయ్యండి; భోంచేసి అలా చండీతలాకేసి పోతాను. మీ ఆడబిడ్డ ఆ చండీతలా సమ్మర్దంలో నలిగి ఏమైపోయిందో చూసివస్తా,'' అని పీట వేసుకున్నాడు.

"ఎంత ఆపేక్ష !'' అన్నది వాసంతి.

ఒకగంట గడిచాక ఆమె గదిలోకి వచ్చి, పచార్లుచేస్తున్న భర్తని చూసి, ఆశ్చర్యంగా, "మీ రింకా పడుకోలేదా ?'' అన్నది. అతని వంటిమీద చెయ్యివేసి చూస్తూ. అత నామెచేతిని విదిలించేశాడు. తనమీద అలిగాడని గ్రహించి ఆమె వెళ్ళిపోబోయింది. అత నామెను చెయ్యిపట్టుకుని నిలవేసి, "ఎక్కడికి ? మళ్ళా ఆ ఆడబిడ్డ మొగుడిదగ్గిరకేనా ?'' అన్నాడు.

"అలా మాట్లాడటానికి సిగ్గెయ్యటంలేదూ ?'' అన్న దామె కోపంగా చూస్తూ.

"పరాయివాడితో పరాచకాలాడటానికి నీకు లేనిసిగ్గు నాకా ?'' అన్నా డతను. ఆమె చెవులు మూసుకుని ఆర్తనాదం చేసింది.

''ఇంత సేపూ ఏం చేస్తున్నావు ?"

ఆమె ఏడవ నారంభించింది.

"ఎందు కా ఏడుపు ? ఇంత సేపూ నీ కతనితో ఏమిటి రాచకార్యాలు ?"

"అతను ఆడబిడ్డను వెతకటానికి ఎప్పుడనగా వెళ్ళాడు. నే నింత సేపూ అత్తగారికి ఏకాదశీ ఫలహారం చేస్తున్నాను."

అతని ఆగ్రహం చెల్లెలికేసి మళ్ళింది. "వెతకటానికా ? ఎక్కడి కెళ్ళింది సుధ ? చండీతలాకు వెళ్ళిందా ?" అన్నా డతను.

"ఎందుకు వెళ్ళదు ? వెళ్ళరాదని మొగుడు ఆంక్ష పెట్టలేదే !"

''అతనూ ఓ మనిషే!... రానీ, అడుగుతాను_నేను వద్దంటే ఎందుకు వెళ్ళిందో."

"అందరూ నాలాగే ఉంటారా_ ఆజ్ఞకు కట్టుబడి ? అయినా అనుమానాలు తప్పటంలేదు," అన్నది వాసంతి.

''ఏమైనా నువ్వతనికి అంత చనువెందుకివ్వాలి ? రేపటినుంచీ నువు అతను అన్నం తినేచోట ఉండకూడదు, నా ఆజ్ఞ !"

''ఒక్కటడుగుతాను, చెబుతారా ? అతనిమీద మీ కెందు కింత కోపం? అతనిలో ఏకోశానన్నా దుష్ప్రవర్తన ఉన్నదా ? పసిబిడ్డలాటివాడుగదా !'' అన్న దామె.

"కావచ్చు. కాని నువు పసిదానివికావుగా ? ఉచితానుచితాలు నీ కెందుకు తెలీక పోవాలీ ? నువు ఇకనైనా సరిగా ప్రవర్తించకపోయావంటే మీ ఇద్దరికీ మూడిందే !" అన్నాడు శశిధరుడు విషం కక్కుతూ.

## 2

గౌరాంగుడు మొత్తానికి తన భార్యనూ, కొడుకునూ పట్టుకున్నాడు. చతుర్భుజుడి దర్శనం చేసుకున్న ఆడదానికి భర్త మళ్ళా కనిపించిన ఆనందం తోడై సుధ మంచి ఉత్సాహంలో ఉన్నది.

"పిల్లవాడు మహారాజవుతాట్ట! మీ బుద్ధి పూర్తిగా మారిపోతుందిట! అపర నారాయణమూర్తివారు చెప్పారు," అన్న దామె భర్తతో.

''అర్మణీ తీసుకొచ్చావా నాన్నా ?'' అని బాదల్ అడిగాడు.

"తెచ్చారా, బాబూ! నువు పాట నేర్చుకుంటావా ?"

''ఓ. నేర్చుకుంటే నాకు వేషం ఇప్పిస్తావా ?"

''ఇదంతా అందుకే గదట్రా ?''

సుధను ఇంట్లో ప్రవేశించనిచ్చి గౌరాంగుడు బాదల్‌తో సహా నాటక సమాజానికి వెళ్ళాడు అక్కడ "విదురుడి విందు'' అనే నాటకం రిహార్సల్సు జరుగుతున్నాయి. అయితే అక్కడ ప్రతిష్ఠంభన ఏర్పడింది. పేదవాడైన విదురుడివేషం వేసేవాడు, తనకు కిరీటమూ, చమ్కీకోటూ ఉంటేతప్ప విదురుడివేషం వెయ్యనన్నాడు. ఇంకోరిని వెయ్యమన్నా ఆమాటే అంటున్నారు.

ఆ నాటకం రాసినవాడు బాసుల్‌పూర్ స్టేషనుమాస్టరు. చీకటి పడేవేళ గౌరాంగుడు తన హార్మోనియం భుజాన పెట్టుకుని రైలుస్టేషనుకు వెళ్ళాడు.

బాసుల్‌పూరు స్టేషను చిన్న రేకులగుడిసె. అందులో అన్నిపనులూ స్టేషన్ మాస్టరే చూసుకుంటాడు. అందులోనే ఉంటాడు. ఆయనకు భార్యా, పిల్లలూ ఎవరూ లేరు. తెల్లవారుఝామున నాలుగింటికీ, సాయంకాలం నాలుగింటికీ రైళ్ళు వచ్చి, స్టేషనులో అరనిమిషం ఆగి వెళ్ళిపోతాయి. ఆ తరవాత స్టేషనుమాష్టరు కేమీ పని లేదు. నాటకాలు రాస్తూ కూచుంటాడు. నాటకాలద్వారానే గౌరాంగుడికీ ఆయనకూ స్నేహం కలిసింది.

హార్మోనియం చూసి మాస్టరు, చాలా పాతదిగా ఉందే అని సంకోచించాడు. గౌరాంగుడు వాయించిచూస్తే అది సరిగా పలకటంలేదు. ఆ పల్లెటూళ్ళో దాన్ని బాగుచేసేనాళ్ళుకూడా లేరు. గౌరాంగుడు పదిరోజులు పడిన శ్రమంతా వృధా అయింది.

తాను రాసిన ''విదురుడి విందు" నాటకంలో విదురుడి వేషానికి ఎవరూ సిద్ధంగా లేరని విని మాస్టరుకూడా హతాశు డయ్యాడు.

గౌరాంగుడు చీకటిలోపడి ఇంటికి తిరిగి వచ్చేశాడు.

మర్నాడు ఉదయం గౌరాంగుడికోసం బండిలో ఇద్దరుమనుషులు వచ్చారు. గౌరాంగుడు బయటికి వచ్చేసరికి వాళ్ళు, "గోవర్ధనఅధికారి మీమీద వారంటు పెట్టించాడు రండి,'' అన్నారు.

ఈ మాటలు వింటున్న శశిధరుడి కళ్ళు నిప్పులు రాలాయి తన బావమరిది

గోవర్ధనఅధికారి హార్మోనియమును తస్కరించి తెచ్చిఉంటాడని అతను ఊహిం చాడు.

గౌరాంగుడి ముఖంలో మటుకు మార్పేమీ లేదు. ''నేను రాకపోతే ?'' అన్నా డతను ఆ వచ్చిన ఇద్దరితో.

"రాకపోతే కట్టి తీసుకురమ్మని ఉత్తరువు." అన్నారు వాళ్ళు.

"అయితే తాళ్ళు తెచ్చుకోండి." అని అతను లోపలికి వెళ్ళిపోయాడు.

అంతకన్నముందే శశిధరుడు లోపలికి వెళ్ళి, తన బావమరిదిని పట్టుకుపోవ టానికి పోలీసులు వచ్చారనీ, అతను అధికారివద్దగ్గర హార్మోనియం ఎత్తుకువచ్చా డనీ అన్నాడు. సుధ అన్నమాటలను నమ్మింది. వాసంతి నమ్మకపోగా నవ్వి, గోవర్ధన అధికారి అతనిచేత పాటలు పాడించుకొనటానికి ఈ ఎత్తు వేసివుంటా డన్నది.

ఆమె ఊహే చివరకు నిజమయింది.

సమీపంలోనే ఉన్న సోనాడాంగాగ్రామానికి చెందిన జమీందారిణి వ్రతోద్యాప నోత్సవం చేసుకుంటున్నది. ఆ సందర్భంలో గౌరాంగుడిచేత ఒకరోజు భజన పాటలు పాడే ఏర్పాటుకు ఒప్పద్దామని గోవర్ధనఅధికారి మనుషులను పంపుతూ, "ఆ ఖయాలీవాడు రానంటే కట్టి మరీ తీసుకురండి,'' అన్నాడు.



గౌరాంగుడు అధికారితో మాట్లాడి ఇంటికి వచ్చి, తనకోసం బండికూడా సిద్ధంగా ఉండటంచేత, బాదల్‌ను వెంటబెట్టుకుని, వెంటనే సోనాడాంగాకు బయలు దేరాడు.

జమీందారుగారి లోగిట్లో గౌరాంగుడి సంకీర్తన జరగడానికి గొప్పగా ఏర్పాట్లు చేశారు. ఆ ఏర్పాట్లు జరిగినది ఒక మండువా, దానికి నాలుగుపక్కలా గల వరండాలలో ఆడవాళ్ళు కూర్చున్నారు. గౌరాంగుడు వాద్యగాళ్ళతోసహా కూర్చున్నాడు. అతను చందనతిలకం పెట్టుకుని, మెళ్ళో లావైన పూలదండ వేసుకుని, పైన సన్నని మడతగల వుత్తరీయపు మడతమాత్రం వేసుకుని. మహా ఉత్సాహంగా పాడుతుంటే బాదల్ కళ్ళు పారవశ్యం చెందాయి త్వరలోనే వాడికి నిద్ర వచ్చేసింది.

పైఅంతస్తు వరండాలో కూర్చునిఉన్న అపర్ణ కళ్ళుకూడా గౌరాంగుణ్ణి చూసి పారవశ్యం చెందాయి. ధగధగా మెరిసే అతడి శరీరమూ, ఆ చక్కని పాటా చూస్తే అతనామెకు ఒక మామూలు మనిషిలాగా కనబడలేదు. ఆమెకు అతన్ని కలుసుకుని, అభినందించాలని ఉన్నది. అతనా సమయంలో ఆమెకు ఎంత ఆనందం కలిగించాడో చెప్పటం సాధ్యంకాదు.

సంకీర్తన ముగిసింది. అందరూ లేచి వెళ్ళిపోయారు. తివాసీలు చుట్టటానికి వచ్చిన నౌకర్లు నిద్రపోతున్న బాదల్‌ను చూసి, సంకీర్తన చేసినాయన కొడుకని గుర్తించారు. వాళ్ళ ఎంత లేపినా బాదల్ లేచేటట్టులేడు. ఇదంతా పైనుంచి చూస్తున్న అపర్ణ బాదల్‌ను నౌకర్లచేత లోపలికి తెప్పించింది.

ఈలోపల గౌరాంగుణ్ణి ముందులోగిట్లోకి తీసుకుపోయారు. కొంచెంసేపయాక అతను బాదల్‌కోసం అటూఇటూ చూస్తూ, "మావా దేడీ?" అని అడిగాడు. ఇంతలో ఒక దాసీది వచ్చి, గౌరాంగుణ్ణి, 'అమ్మగారు' పిలుస్తున్నారనీ, ఎవరో అబ్బాయి లోపల ఉన్నాడనీ చెప్పింది.

అతను అంతఃపురంలోకి అడుగు పెట్టడం ఆడవాళ్ళకు పర్వ మయింది. వాళ్ళు అతన్ని ఫలహారం చెయ్యమని నిర్బంధించారు గౌరాంగుడు బెదిరి మళ్ళీ బయటకు పోబోతుండగా ఎవరో నవ్వి, "కుర్రవాణ్ని చూడటానికి వచ్చి, పారిపోతున్నారా?" అన్నది.

గౌరాంగుడటుకేసి చూసేసరికి మంచి వయసులో ఉన్న వితంతువు కనిపించింది. ఆమె అపర్ణ. ఆమె అతన్ని నిలవేసి, కాస్త ఫలహారం నోట వేసుకోకుండా వెళ్ళటానికి వీల్లేదన్నది. అతనిముందు పళ్ళెంనిండా ఫలహారాలు తెచ్చిపెట్టారు.

అంతమంది ఆడవాళ్ళు చూస్తూండగా అతను వాటిని ఎలా తినాలో అర్థంకాక ఎదురుతిరిగాడు. అతను లేచి నిలబడి, "వీటిని ముందింటికి పంపండి. అక్కడ తినేవాళ్ళు చాలామంది ఉన్నారు," అన్నాడు

అపర్ణ ముఖం చిన్నబోయింది

"కుర్రాడు మీవాడవునో కాదో, అదైనా చూసుకు మరీ వెళ్ళండి," అన్నదామె. ఆమె ఒక హరికెన్ లాంతరు చేతబట్టుకుని బయలుదేరితే గౌరాంగు డామెను అనుసరించాడు.

అపర్ణ ప్రవర్తన మిగిలిన స్త్రీలకు నచ్చలేదు. కాని ఆమె జమీందారిణికి అక్క కూతురు. అందుచేత ఏమీ అనటానికి లేదు.

ఒకగదిలో, తెల్లనిదుప్పటి పరిచిన దోమతెర మంచంమీద నిద్రపోతున్న బాదల్, అపర్ణ ఎత్తిపట్టిన లాంతరువెలుతురులో కనిపించాడు బాదల్‌కు మర్నాడు పొద్దున భోజనం పెట్టిగాని పంపనన్నది అపర్ణ

మర్నాడు పొద్దున బాదల్ లేవగానే అపర్ణ వాణ్ణి చాలాసేపు వాగించి, రస గుల్లాలు మేపి, 'మీ నాన్నను తీసుకువచ్చి పాటలు పాడించు," అంటూ దాసిదాని వెంట గౌరాంగుడి దగ్గిరికి పంపింది

ఇంటిచుట్టూవున్న తోటలో పచార్లు చేస్తున్న గౌరాంగుడిదగ్గిరికి దాసీవెంట వచ్చి బాదల్, "నాన్నా, పిన్నిగారు నిన్ను వచ్చి రెండుపాటలు పాడమంటు న్నారు," అన్నాడు గౌరాంగుడు లక్ష్యపెట్టక, "రాత్రికి మళ్ళీ సంకీర్తన ఉన్న దిగా?'' అన్నాడు. అమ్మగారు పాడించుకుని బక్షీస్ ఇస్తారంటే, అలాటి పాటలు తనకు రావని దాసికి చెప్పాడు.

అపర్ణే స్వయంగా కదిలి తోటలోకి వచ్చింది. కాని ఆమె ఎత్తు లేవీ పారలేదు. అతను పాడటానికి ఒప్పుకోలేదు. ఆమె అతనికి తన మెళ్ళో గొలుసు తీసి బహు మానం ఇవ్వబోతే మొరటుగా నిరాకరించాడు. ఆమె రెండు పదిరూపాయలనోట్లు ఇవ్వబోయింది. అతను వాటినీ నిరాకరించాడు.

ఈ సంఘటన తరువాత గౌరాంగుడి మనసు అశాంతికి గురిఅయి, ఇంటికి వెళ్ళిపోతానని కూర్చున్నాడు. అతనిబుద్ధి మళ్ళించడం అసాధ్యమని ఎరిగి గోవర్ధన అధికారి అతనికి బండి సిద్ధం చేయించాడు. అతను బాదల్‌తోసహా తిరిగి వచ్చే టప్పుడు అపర్ణ అతని కొక చీటీ పంపింది.

"సంబోధించటానికి ధైర్యం చాలదు. ఎప్పుడైనా అవసరం వస్తే కింది చిరు నామా గుర్తుంచుకోండి_బాదల్ పినతల్లి, అపర్ణాఘోష్, శరత్‌భవన్, త్రివేణి."

అని ఆ చీటీలో ఉంది. దాన్ని గౌరాంగుడు చించి ముక్కలు చేసి, బండిలోనుంచి బయటికి గిరవాటువేశాడు.

గౌరాంగుడూ, కొడుకూ ఇంటిముందు బండి దిగేసరికి దీపాలు పెట్టేవేళయింది. తలవాకిలిదగ్గిర నీళ్లు చల్లడానికి వచ్చిన వాసంతి, "అప్పుడే వచ్చేశారే? కలవా రిల్లు కంటకమయిందా?" అన్నది.

"నా మనసు కనిపెట్టగలవారు మీ రొక్కరేనని ఊరికే అంటానా?" అన్నాడు.

ముగ్గురూ లోపలికి వచ్చాక బాదల్ అకుల్లో కట్టిన పూలమాలలు - తనకూ, తండ్రికీ వేసినవి-తీసి అత్తకు చూపించాడు. వాసంతి ఒక దండ తీసి బాదల్ మెడలో వేసి, "అచ్చు కృష్ణుడిలా ఉన్నాడు కాదూ?" అన్నది. ఆమె గౌరాంగుడితో, "మీరుకూడా దండ వేసుకోండి! కలియుగ గౌరాంగుణ్ణి చూసి కళ్ళు సార్ధకం చేసుకుంటాను," అన్నది.

ప్రపంచజ్ఞానంలేని గౌరాంగుడు, వాసంతి చేతిలోని మాల తీసుకుని చప్పున ఆమె మెడలోనే వేసి, "మాలకాదు, సఖీ, నా హృదయజ్వాల," అని పాడాడు.

సంధ్యవార్చుతూ ఇదంతా వింటున్న శశిధరుడు లేచివచ్చి, బాంబులాగా పేలాడు. అతను తన భార్యను అవతలికి పొమ్మని చెయ్యి ఊపి, గౌరాంగుడితో, "నీ వెధవ్వేషాల కిదా చోటు? ఇది పరువైన ఇల్లనుకున్నావా, కల్లుపాక అను కున్నావా?" అన్నాడు. శశిధరుడు అంత దురుసుగా తనతో మాట్లాడటం అదే మొదలు; గౌరాంగుడు నివ్వెరపోయాడు.

వాసంతి కిందపారేసిన మాలను శశిధరుడు కాళ్ళతో మట్టగించాడు. అతనికి కోపంతోనూ, అసూయతోనూ ప్రేతకళపడింది.

గౌరాంగుడు తిన్నగా స్టేషనుకు వెళ్ళి, స్టేషనుమాస్టరుతో అపర్ణ చర్యలు వర్ణించి చెప్పాడు. స్టేషనుమాస్టరు తాను రాసిన కొత్తనాటకాన్ని అతనికి చదివి వినిపించాడు.

ఈలోపల నిభానని పెత్తనాలనుంచి తిరిగివచ్చి, సుధతో అపరనారాయణమూర్తి వారు చండీతలానుంచి వెళ్ళిపోతున్నారనీ, అందరూ ఆఖరుసారిఅయినా దర్శనం కోసం మళ్ళీ వెళుతున్నారనీ చెప్పడం వాసంతి విన్నది. ఆమె వంటింటో కంట తడిపెడుతూ కూర్చున్నది. శశిధరుడి అవమానం - తాను దర్శనం చేసుకోకుండానే చతుర్భుజుడు వెళ్ళిపోతూండడం!

ఆ రాత్రి ఆమె చాపవేసుకుని కిందనే పడుకున్నది. పేకాటనుంచి ఆలస్యంగా

తిరిగివచ్చిన శశిధరుడు ఆమెను చూసి, అధికారస్వరంతో, "కింద పడుకున్నావేం? జబ్బు చేస్తుంది! లే!" అన్నాడు.

"జబ్బుచేస్తే చెయ్యనియ్యండి," అన్నది వాసంతి

"అర్థంలేని మాటలు."

''అర్థం ఎందుకులేదూ? నేను జబ్బు చేసి చచ్చిపోతే మీరు హాయిగా ఉందురు గాని. మీకూ, నాకూకూడా విముక్తి."

''నువు చచ్చిపోతే గౌరాంగుడిగతి ఏంకాను?... ఇవాళ ఇదేదో తేల్చేస్తాను. ఆ దుర్మార్గుడితో ఇక మాట్లాడనని నన్ను తాకి ప్రమాణంచెయ్యి."

"నే నేం పిచ్చిదాన్నికాను."

"అలా అంటావని నాకు ముందేతెలుసు. నువు నిజంగా పతివ్రతవైతే ప్రమాణం చేసి ఉందేదానివే."

వాసంతి పట్టలేక, "న న్నింతమా టంటారా!'' అన్నది.

''ఎందు కనగూడదూ? పరాయివాడిమీద మనసుంది, మెళ్ళో మాల వేయించు కున్నదానివి!"

"సరే, అలాంటిదాంతో మీరెందుకు కాపరంచెయ్యాలి. నేను చచ్చిపోయి మీకు విముక్తి కలిగిస్తాను''

"మాటలు అనటానికేం?... చచ్చిఅయినా పోతానంటావుగాని, ఆ గౌరాం గుడితో మాట్లాడనని ప్రమాణం చెయ్యవన్నమాట దాన్నిబట్టి ఏమనుకోవాలి?''

ఎంతోసేపు కుమిలి కుమిలి ఏడ్చి నిద్రపోయినవాసంతి తెల్లారగట్ట నిద్ర లేచింది. ఆమెకు చచ్చిపోదా మనిపించింది. ఆమె బిందె ఒకటి తీసుకుని, దొడ్డిదారిన చెరువుకేసి వెళ్ళింది. అయితే చెరువులో నీళ్ళు ఏమాత్రమూ లోతులేవు. కాని ఒడ్డున గన్నేరుచెట్టున్నది. దాని కాయలు కింద బోలెడన్ని పడిఉన్నాయి. ఆమె గన్నేరుకాయలు ఏరి ఒడినిండా పోసుకున్నది.

అంతలోనే ఆ తూర్పు తెల్లవారే సమయంలో ఎవరో పంపినట్టుగా గౌరాంగుడు చెరువు గట్టుకేసి వచ్చాడు. చచ్చిపోవటానికి నిశ్చయించుకుని కూడా వాసంతి, ఆ సమయంలో తనభర్త లేచివచ్చి, తననూ గౌరాంగుణ్ణీ ఒకచోట చూస్తాడేమోనని భయపడింది.

''ఇదేమిటి? ఈచలిలో ఇంతపెందలాడే స్నానమా? వెళ్ళి, బొంతకప్పుకు పడుకోండి," అన్నాడు గౌరాంగు డామెతో.

అతని ఆప్యాయత చూసి ఆమెకు దుఃఖం ఆగలేదు. ఆమె దుఃఖానికి ఆదుర్దా

పడుతూనే అతను సహజమైన హాస్యధోరణిలో, "కన్నీటితో చెరువులోనీరు భర్తీ చేస్తారా ఏమిటి?'' అన్నాడు.

''చాల్లెండి; మీహాస్యమే కొంప ముంచింది. ఆయనకు మనమీద అనుమానం; ఆసంగతికూడా మీరు గ్రహించలేదా?'' అన్న దామె.

"తెలుస్తూనేఉంది. అదో జబ్బు. నానాటికీ ముదురుతున్నది. దాని కేదన్నా మందు వెయ్యాలి."

''మందుకోసమే వచ్చాను," అంటూ వాసంతి కంగారులో తన ఒడిలోవి గన్నేరుకాయలను జారవిడిచింది.

వాటిని చూడగానే, ఎన్నడూ కోపంరాని గౌరాంగుడికే కోపం వచ్చింది. "ఇందుకా చీకటితోనే లేచివచ్చారు?" అంటూ అతను గన్నేరుకాయలను ఏరి చెరువులో గిరవాటు వేశాడు.

అతని కొక ఆలోచనవచ్చింది — చతుర్భుజలవారిదగ్గిరికి వెళ్ళి, తన బావమరిది అనుమానరోగానికి మందు తెస్తే?

ఈమాటతో వాసంతికి ప్రాణం లేచివచ్చింది.

"నన్నొకసారి అక్కడికి తీసుకుపోతారా?'' అని ఆమె గౌరాంగుణ్ణి అడిగింది. కాని అందుకు శశిధరుడు ఒప్పుకోడు; ఇవాళ ఆదివారం. శశిధరుడు రోజల్లా ఇంట్లోనే ఉంటాడు. రేపు మధ్యాన్నమైతే వీలు. కాని రేపు చతుర్భుజుడు మకాం ఎత్తేసి వెళ్ళిపోతున్నాడు.

ఈసమస్య తేలకముందే సుధ, తువాలా, నూనెసీసా, బిందె తీసుకుని స్నానానికి వచ్చింది. ఆ ఇద్దరూ ఆసక్తిగా ఏదో మాట్లాడుకుంటూ ఉండటం గమనించింది. ఆమె బెట్టుగా ఆ ఇద్దరిమధ్యగా చెరువుకేసివెళ్ళి తువాలా నీళ్ళలో ముంచి, శక్తికొద్దీ రాతికేసి బాదుతూ ఉరకసాగింది.

"ఇంతకీ ఏం చేద్దాం?'' అన్నది వాసంతి.

''రాత్రికి వెళ్ళండి. అర్ధరాత్రి పన్నెండుదాకా జనంసందడి ఉండనే ఉంటుంది." అన్నాడు గౌరాంగుడు. భర్త నిద్రపోయాక బయలుదేరితే ఒక గంటలోపుగా తిరిగి రావచ్చు నన్నాడు.

ఆపగలు దినకృత్యాలన్నిటినీ వాసంతి మామూలుగానే చేసింది. ఎన్నిపనులు చేస్తున్నా ఆమె మనసులో ఆలోచన దానిదారిన అది నడుస్తూనేఉన్నది. సాయంకాలం ఆమె వంట చేసేటప్పుడు గౌరాంగుడు వచ్చి నంటింటిగడపమీద కూర్చుని, రహస్యంగా ఆమెకు అనేక సలహా లిచ్చాడు — శశిధరుడూ, సుధా కొంచెం



హెచ్చుగా తినేట్టు చూడటం మంచిది. వాళ్ళు గాఢంగా నిద్రపోతారు; నల్లచీరె కట్టుకుని బయలుదేరితే ఎవరూ గుర్తించరు; వాసంతికి నల్లచీరెలేదు, కాని సుధకు బోలెడన్ని ఉన్నాయి – ఏదోవకటి చెప్పకుండా తీసుకుంటేపోయె.

వాళ్ళు గుసగుస లాడడం శశిధరుడు విన్నట్టు వాళ్ళెరుగరు. అతను అటకమీది నుంచి తళతళలాడే కత్తి తీయటం వాళ్ళకు మొదలేతెలీదు.

వంట పూర్తిఅయి, అందరికీ భోజనాలు పెట్టాక, వాసంతికి చతుర్భుజుణ్ణి చూడాలన్నకోరిక పూర్తిగా అంతరించి, ఏదో అస్పష్టమైన భయం పట్టుకున్నది. కాని గౌరాంగుడితో అన్నిఏర్పాట్లూ చేసుకున్నది. అతను ముందుగా బయలుదేరి, ఆమెకోసం కనిపెట్టుకుని ఉంటాడు. వెళ్ళక తప్పదు.

అసలే చీకటిరాత్రి. దారిఅంతా చెట్లమయం. కన్ను పొడుచుకున్నా కనపడని అంధకారం. ఆ ఆంధకారంలో వేచిఉన్న గౌరాంగుడు వాసంతి రాగానే, రహస్యంగా, "వచ్చావా? ఎవరూ చూడలేదుగద? జాగర్తగా నడవండి. ఎదురుదెబ్బ తగల గలదు,'' అన్నాడు.

అంతలోనే అగ్గిపుల్ల వెలిగి, దానికాంతి వారిద్దరి ముఖాలమీదా క్షణంసేపు పడింది. ఆక్షణంలోనే, కట్టెలునరికే వాసంతి మడ్డికత్తి తళుక్కున మెరిసింది

గౌరాంగుడు అగ్గిపుల్ల అవతల పారేసి, "వాహ్ ! బాగుంది !'' అంటూ ఏదో పాట పాడాడు అంతలోనే పాడేగొంతు ఎవరో పిసికేసినట్టయింది చీకట్లో ఏమి జరుగుతున్నదీ కనిపించటంలేదు.

"గౌరాంగ్‌దా : పారిపోండి, మీకు దణ్ణం పెడతాను. ఆయన మిమ్మల్ని చంపేస్తారు," అని వాసంతి కంఠం అనడం వినిపించింది.

"శశిధర్‌దా మిమ్మల్ని —''

''నాసంగతి ఏమైతే అవుతుంది. అపవాదుకన్న చావు నయం. మీరు వెళ్ళండి, వెళ్ళండి !"

గౌరాంగుడు వెళ్ళిపోతున్న చప్పుడు వినిపించింది.

తరవాత వాసంతి కంఠం, "ఇహ మీయిష్టం ! నన్ను చంపండి, నరకండి ! ఏమైనా చెయ్యండి," అన్నది.

ఆ మరుక్షణం ఎవరో బరువుగా కిందపడిన చప్పుడయింది.

వాసంతి భయంతో కెవ్వున కేకపెట్టసాగింది.

## 3

తనని ఎవరో పిలుస్తూండడం విని స్టేషనుమాస్టరు నిద్రలేచి, తలుపు తెరిచి, గౌరాంగుణ్ణి చూసి ఆశ్చర్యపోతూ, "ఏమి టిది? ఇంత రాత్రివేళ –'' అన్నాడు.

గౌరాంగు డిన్ని మంచినీళ్ళు తాగి, తాను పారిపోయివచ్చేదాకా జరిగినదంతా చెప్పి, "ఆమెగతి ఏం కానుందో ? శశిధర్‌దా తెలిసీ తెలియనిరకం,'' అన్నాడు

"అతనంత కోపిష్టివాడైనప్పుడు, నువు చేసినపని ఏం బాగుంది ?'' అన్నాడు మాస్టరు.

"పాపం, ఆమె సంగతికూడా ఆలోచించాలిగద ! అందరూ వెళ్ళి చూస్తుంటే, ఒకర్తెమాత్రమే వెళ్ళలేకపోయింది. అదీగాక శశిధరుడి రోగానికి మందు దొరుకుతుందేమోనని ..."

గౌరాంగుడిమాట పూర్తికాకముందే తలుపు చప్పుడయింది. జగదీశుడనే కుర్రాడు, "గౌరాంగ్‌దా ఉన్నారా ?'' అని బయటినుంచి కేకపెట్టాడు గౌరాంగుడు ఉన్నానని కేకబెట్టబోయేటంతలో మాస్టరు అతనినోటికి చెయ్యి అడ్డుపెట్టి, పలకవద్దని సంజ్ఞ చేసి, వెళ్ళి తలుపు తీసి, ''సంగతేమిటి జగదీశ్ ?'' అని అడిగాడు.

''కొంప మునిగింది మాస్టరుగారూ ! శశిధర్‌ఘోషాల్ ఖూనీ అయాడు.

గౌరాంగ్‌దా కనిపించటంలేదు. పోలీసులు వెతకటం మొదలుపెడతారు,'' అన్నాడు జగదీశుడు ఎగరొప్పుతూ. మరుక్షణం వాడు రివ్వున దౌడుతీస్తూ వెళ్ళిపోయాడు

గౌరాంగుడుకూడా వెళ్ళిపోవడానికి సిద్ధపడుతూ, శశిధర్‌దా ఖూనీ అయాడా ? తప్పక నాచేతిలోనే ఖూనీ అయిఉంటాడు. నేను చీకట్లో తోసేశాను. కిందపడి తల పగలగొట్టుకుని ఉంటాడు. నన్ను వెళ్ళనివ్వండి,'' అన్నాడు.

మాస్టరు అతన్ని గట్టిగా పట్టుకుని, ''ఇంకానయం ! నువ్విప్పుడక్కడికి వెళితే ఇంకేమన్నా ఉందా ? నువ్వెళ్ళి నిజం చెబితే, పోయినవాడు పోగా వాసంతి కెంత కళంకం ? నీభార్య మాటేమిటి ! ఏమీ ఆలోచించవేం ?'' అన్నాడు.

గౌరాంగుడు విభ్రాంతుడై ? "అయితే ఏం చెయ్యను ?" అని అడిగాడు.

''ఇం కేం చేస్తావు ? వెంటనే పారిపో ! ఈ చుట్టుపట్ల ఎక్కడా వుండకుండా దూరంగా, చాలాదూరంగా పారిపో. ఇటుకేసి మళ్ళీ రాకు; నువ్వూ బతికిపోతావు, మిగిలినవాళ్ళూ బతికిపోతారు," అన్నాడు మాస్టరు.

ఖాసుల్‌పూర్ స్టేషనులో అరనిమిషం ఆగే రాత్రిబండిలోకి స్టేషనుమాస్టరు గౌరాంగుణ్ణి తోసి ఎక్కించాడు. రైలు వెళ్ళిపోయింది. మాస్టరు నిర్జీవంగా నడుచుకుంటూ తన ఆఫీసులోకి వెళ్ళిపోయాడు.



తరవాత అతనికి ఒక పెద్దమనిషిఇంట ఆశ్రయం దొరికింది. ఆమనిషి చూపిన దయ నిజంగా అవ్యాజమైనదే, కాని అలాటి అవ్యాజకరుణకు ప్రపంచంలో స్థానం లేదు; అందుచేత ఆ పెద్దమనిషి మేలుకోరేవా డొకడు వచ్చి, "నువు ఇంట్లో చేరనిచ్చిన ఈమనిషి ఎవడు? ఎలాటివాడు ? ఆరా తీయ నవసరంలేదా ?" అన్నాడు. ఆ మాట వింటూనే గౌరంగు డక్కడినుంచి నిష్క్రమించాడు.

మరొకసారి గౌరాంగుడు వర్ధమాన్‌లో ఒక హోటలు వెనుకవుండే గొందిలో నిలబడివున్నాడు. హోటలువంటవాడు దొడ్డితలుపులు తీసుకుని, చేతిలో అన్నం పళ్ళెం పట్టుకుని వచ్చాడు – అతనికోసం. గౌరాంగుడు చుట్టూవున్న పెంటకుప్పల్ని కలయజూసి, "ఎక్కడ కూర్చోను ? ఎలా తినను ?" అన్నాడు. ఆ కుళ్ళుప్రదేశంలో కూర్చుని తిండి తినటం అతనికి సాధ్యం కాలేదు.

"అయితే రాత్రి చీకటిపడ్డాక, ఎవరికీ తెలియకుండా రా,'' అని వంటవాడు, వెళ్ళిపోతున్న గౌరాంగుణ్ణి మనసులో కాస్త గౌరవించాడు. అటుతరువాత అతనికి కొన్నాళ్ళపాటు ఈ హోటలుతిండి లభించింది.

వర్ధమాన్‌లో అతను ఎక్కువరోజులే ఉన్నాడు. చివర కతను రైలు ఎక్కనే ఎక్కాడు. రైలు ఒకొక్క స్టేషనే దాటిపోతున్నది. అతని కేం బుద్ధిపుట్టిందో ఒక స్టేషనులో రైలు ఆగగానే చప్పున దిగిపోయాడు. అతను నడుస్తూ తలఎత్తి చూసేసరికి, స్టేషను పేరుండే పలకమీద "త్రివేణి" అని రాసివున్నది.

ఆ మాట తనకు ఎలా పరిచితమైందీ అతనికి వెంటనే జ్ఞాపకం రాలేదు తీరా వచ్చాక అతనికి ఆశ్చర్యం వేసింది అపర్ణ పంపిన చీటీలో ఆమె ఇచ్చిన చిరునామాలో త్రివేణి ఉన్నది. ఆదేనా ఈ త్రివేణి ?

అతని అనుమానం తీరటానికి ఎంతోసేపు పట్టలేదు. అతను దారేపొయ్యేవాణ్ణి గంగ ఎటుంటుందని అడిగి, ఆ దిక్కుగా నడుస్తూండగా ఒక సైకిలురిక్షా అతన్ని సమీపించింది. అందులో అపర్ణ వున్నది. ఆమెను చూస్తే, గంగాస్నానం చేసి వస్తున్న ట్లున్నది

ఆమె అతని సమీపంలో రిక్షా దిగి ''గౌరాంగ రాకూర్‌గారు కాదూ? ఏమి టిలా మారిపోయారు. రండి, రండి," అన్నది. ఆమె అతన్ని రిక్షాలో ఎక్కమనలేదు; సామానుతోపాటు రిక్షాను వెంటరమ్మని, దగ్గరలోనే ఉన్న తన ఇంటికి గౌరాంగుడితోపాటు నడిచింది.

''మీ యింటికి నే నెందుకు ?" అన్నాడు గౌరాంగుడు.

"ఇంటికి వెళ్ళాక చెబుతాను. మీకోసం బాసుల్పూరు మనిషిని పంపితే చెప్పకుండా ఎటో వెళ్ళిపోయారని తెలిసింది. భలే మనిషండీ మీరు!" అన్నది అపర్ణ.

అమితాశ్చర్యంతో గౌరాంగుడు కళ్ళు పెద్దవి చేసి, "బాసుల్పూరుకు మనిషిని పంపారా? ఎవరింటికి పంపారు?" అని అడిగాడు.

"ఇంతలోనే మరిచా ననుకున్నారా? మిమ్మల్నీ, బాదల్నూ తీసుకురమ్మని శశిధరఘోషాల్గారింటికి మనిషిని పంపాను," అన్న దామె.

"అసంభవం," అన్నా డతను.

ఇంతలో వాళ్ళు అపర్ణ యిల్లు చేరటంతో సంభాషణ ఆగింది. ఆ ఇల్లు పెద్ద భవంతేగాని, చాలా పాతది. ఇంటిముందున్న పెద్ద ఇనపగేటుదగ్గిర హిందుస్తానీ దర్వాన్ ఉన్నాడు. నేలకంటా వంగి వాడు అపర్ణకి సలాం చేసి, గౌరాంగుడి కేసి అనుమానంగా చూస్తుంటే, అతను తన గురువుగారని ఆమె వాడితో చెప్పింది. రిక్షావాడు తడిగుడ్డలనూ, గంగాజలాన్నీ వరండాలో పెట్టి వెళ్ళిపోయాడు.

ఇల్లంతా నిర్జనంగా, బావురుమంటున్నది.

"న న్నిక్కడి కెందుకు తెచ్చారు?" అన్నా డతను చిరాకుగా.

"పేదవా రింట బ్రాహ్మణుల పాదధూళి పడరాదా? శూద్రుల ఇంట భోజనం చెయ్యటానికి అభ్యంతరమా? అభ్యంతరం ఉంటే తరవాత ప్రాయశ్చిత్తం చేసుకుందురుగాని రండి."

అపర్ణ కళ్ళు నవ్వుతున్నాయి.

"నాకు జాతి మత విభేదా లేమీ లేవు," అంటూ గౌరాంగుడు ఆమె వెంట లోపలికి వెళ్ళాడు.

అతను భోజనానికి కూర్చున్నప్పుడు, "ఇవ్వాళ మీరు నాకు దొరకడం ఎంతో అదృష్టం!" అన్నది అపర్ణ.

"సంగతంతా తెలిస్తే మీ రలా అననే అనరు," అన్నా డతను.

భోజనం అయాక అతను "ఇక వెళతాను. నా పట్ల మీరు చూపిన ఈ ఆదరాన్ని ఎన్నటికీ మరవను," అన్నాడు.

"అప్పుడే వెళతారా, స్వామీ? రాధావల్లభమందిరంలో మీరు సంకీర్తన చేస్తారని ఆశపడ్డానే," అన్నది అపర్ణ.

"సంకీర్తనా? అసంభవం! నే నిప్పుడు పాడలేను. పాటలన్నీ మరచిపోయాను," అన్నా డతను.

"నేను నమ్మను. ఆ రోజు మీరు సంకీర్తన చేసేప్పుడు పైనుంచి చూస్తుంటే,

మీరు ఏ దేవలోకంనుంచో దిగివచ్చారనిపించింది. ఆ రూపాన్ని మరువడం నాకు సాధ్యం కాలేదు," అన్నది గతాన్ని స్మరించుకుని, స్వగతం మాట్లాడుకుంటున్న దానిలాగా అపర్ణ.

అతని కేమీ అర్థంకాక, "ఏమిటన్నారు ?" అని అడిగాడు.

"ఏమీలేదు, రెండురోజు లుండి వెళ్ళం డంటున్నాను. మరొక్కసారి మీ పాట వింటాను."

"చూడండీ, మీకు పరిస్థితి ఏమీ తెలీకుండా ఉంది. నేను ఉండడానికి వీల్లేదు... నేను అభాగ్యుణ్ణి, రోయదగినవాణ్ణి. నా కథంతా వింటే మీకు ఒళ్లు కంపరమెత్తి నన్ను వెళ్ళగొట్టేస్తారు," అన్నా డతను.

"నేనా ! మిమ్మల్నా ? ఎంత అమాయకులండీ మీరు !"

"నేనే వెర్రివా ణ్ణనుకుంటే, నాకన్న తెలివితక్కువ మీది. దారిలో కనబడగానే త్రిన్నగా ఇంటికి తెచ్చారు. ఇందువల్ల మీ కెంత ఆపద కలుగుతుందో ఆలోచించను కూడాలేదు. ఈ ఇంటో మగవా శ్ళెవరూ లేనట్టుంది. ఉండిఉంటే ఏమయేది ?"

అపర్ణ ముఖం పక్కకు తిప్పి నవ్వుకుని, "లేకపోబట్టేగదా సహసించాను. రెండు రోజు లుంటానని మాట ఇవ్వండి," అన్నది.



"కాని, పోలీసులు వచ్చి మీ ఇంటిమీద పడితే ?''

"పోలీసులా ? పోలీసు లెందుకుపడతారూ ?"

"నే చెబుతున్న దేమిటి ? పోలీసులు నా కోసం గాలిస్తున్నారు."

"వాళ్ళకుగాని మీ పాట వినిపించారాఏం ?"

"మీ కంతా హాస్యంగా ఉన్నది."

"నా కేం తెలుస్తుంది ? మీ రింటినుంచి పారిపోయింది నా మూలంగా కాదు గద ?" అన్నది అపర్ణ అమాయకం నటిస్తూ.

గౌరాంగుడు చిర్రెత్తిపోయి, ''నేను ఖూనీ చేసి, పరారీ అయి తిరుగుతున్నాను. ఇప్పుడయినా తెలిసిందా ?" అన్నాడు.

ఆమె ఒక్క క్షణంపాటు మాత్రమే నివ్వెరపోయి, ఆ తరువాత కిలకిలా నవ్వనారంభించింది. అతను ఎంత చెప్పినా ఆమె ఖూనీమాట నమ్మ నిరాకరించింది. కాని తనవెంట పోలీసులు పడ్డారని అత నన్న మాటలో ఆమెకు నమ్మకం కుదిరి నట్టున్నది.

"పోలీసులు మీ వెంట పడినమాట నిజమయితే, పారిపోవటంకన్న ఇక్కడ ఉండటమే క్షేమం. లంకంత ఇల్లు, అంతా ఖాళీగా వుంది. ఇటుకేసి పోలీసులు తొంగిచూడరు,'' అన్నది అపర్ణ.

"నే నిక్కడ ఉండనా ? మీ కేమన్నా పిచ్చా ఏం ?" అన్నా డతను.

"వస్తుతహా కాను. కాని నువే నన్ను పిచ్చిదాన్ని చేశావు," అని ఆమె లోపల అనుకుని, పైకి, "మీరు నాకు గురువులాంటివారు. గురువులు శిష్యుల ఇళ్ళలో ఉండరా ?" అన్నది.

"ఇంట్లో మరెవరూ లేరుకూడానే ?"

"అది నాతప్పా స్వామీ ! దేవుడు నన్ను మోసగించాడు. అంతమాత్రాన నాకు జీవితం శూన్యమైపోవాలా ? ప్రపంచంనిండా ఎంతో సంతోషం ఉంది, ఆనందం ఉంది. నాకు అందులో భాగం లేకపోవటానికి నే నేం అపరాధం చేశాను. అకాల వితంతువు నయాను. ఇంకా నాది నిండువయసు..."

ఆపర్ణమాటలకు గౌరాంగుడు అడ్డుతగిలి, "ఛీ, హిందూస్త్రీలు ఇలాటి ఆలోచనలను మనసులోకి రానివ్వరాదు,'' అన్నాడు.

అపర్ణ నవ్వి, ఆలోచనలు రావటం మన చేతుల్లో లేదనీ, తనకు అహోరాత్రాలు ఆలోచనలుతప్ప ఇంకేమీ లేవనీ, తనకు పురుషుడు ఏంచేసినా తప్పు లేనప్పుడు

స్త్రీకి ఆలోచనలు రావడమే తప్పవుతుందా అనీ, తన భర్తతోపాటు తనలోని కాంక్షలన్నీ ఎందుకు చావలేదనీ అడిగింది.

"నేనొక పల్లెటూరిబైతును. ఇలాటి విషయాలు గ్రహించలేను. నన్ను వెళ్ళనివ్వండి. పోలీసులకు భయపడి ఇక్కడ దాక్కుంటే నాకు మనశ్శాంతి ఉండదు," అన్నాడు గౌరాంగుడు.

"తెలిసింది నేనంటే మీకు అసహ్యం. ఒక్క మనవి వినండి. శ్రావణ పూర్ణిమనాడు మా మందిర ప్రతిష్ఠ జరుగుతుంది. ఎందరో బ్రాహ్మలూ, సాధువులూ వస్తారు," అన్నది అపర్ణ.

ఆమె అంతగా ప్రాధేయపడుతుంటే గౌరాంగుడు కాదనలేకపోయాడు. అతనికామె ఎలాంటిలోటూ లేకుండా సేవా శుశ్రూషలు చేసింది. ఆమె చేసే ఆతిథ్యం అతనికి అడుగడుగునా వెక్కసంగానే ఉండేది.



తన మామగారి తరంనుంచీ పూజాగృహంలో ఉలటున్న రాధావల్లభుడికోసం కొత్తగా ఒకమందిరం కట్టించింది. మర్నాడే శ్రావణ పూర్ణిమ; ఆరోజు కొత్త మందిరం ధూపదీపాలతో కళకళ లాడుతుంది — కాని మరొకమందిరం ఖాళీ అవుతుంది ; గౌరాంగుడు వెళ్ళిపోతాడు ; అతన్ని ఎలా ఆపి ఉంచడం ?

ఆలయ అలంకరణలో గౌరాంగుడుకూడా ఉత్సాహంగా పాల్గొంటున్నాడు. తాను పరారీ హంతకుడన్నమాటకూడా మరిచాడు.

పెద్ద గాలివాన ముంచుకొచ్చింది. గౌరాంగుడు మందిరంలోనుంచి మంటపంలోకి వచ్చి కూర్చున్నాడు. తాను పారిపోయిననాడుకూడా ఇలాగే వర్షం. కాని ఆనాడు తల దాచుకునేటందు కింత చక్కనిచోటు లేకపోయింది

అపర్ణ పూలసజ్జతోవచ్చి. అతను లేచినచోట కూర్చుని, అతన్నికూడా తన పక్కన కూర్చోమన్నది. ఆమె ఇవాళ తెగబడినట్టున్నది. ఆమె మాటల కతను చీదరించుకున్నాడు.

ఇంతలో ఒక దాసీది వచ్చి అపర్ణతో, "ఇనస్పెక్టరు ఎవరో మీకోసం వచ్చి బయట నిలబడిఉన్నాడు,'' అని చెప్పింది.

అపర్ణ ఒక్కసారిగా కొయ్యబారిపోయి గౌరాంగుడికేసి చూసింది.

గౌరాంగుడు విషాదంగా నవ్వి, "పదండి. నాకు ఆతిధ్య మిచ్చినందుకు ఫలితం అనుభవిద్దురుగాని,'' అన్నాడు అతను దాసీదానివెంట పోబోతూంటే అపర్ణ అతని చెయ్యి గట్టిగా పట్టుకుని, ''వద్దు. మందిరం వెనకఉన్న మామిడితోపులోంచి రైలుస్టేషనుకు వెళ్ళి. అందినరైలెక్కి పారిపొండి," అన్నది.

అతను చెయ్యి విడిపించుకుని, "ఇంక పారిపోను. నాలో బతకాలనే కోరిక చచ్చిపోయింది. చేసినదానికి శిక్ష పడాలిసిందే. పట్టుబడిపోతాను,'' అన్నాడు.

అపర్ణ నిలువునా వణుకుతూ, "వద్దుస్వామీ. మీరు పట్టుబడితే నాగతి ఏమవుతుందో చూడండి. హంతకుణ్ణి దాచినందుకు నాకు శిక్ష పడుతుంది. నన్ను అధో తిగపాలు చేస్తారా ?'' అన్నది

గౌరాంగుడు వెటకారంగా నవ్వి, ''అలాఅయితే సరే. ఇక మనకు దేవుడూ - భక్తురాలూ సంబంధం పోయినట్టేగా ?" అన్నాడు.

"ఆ. ప్రాణాలమీద ఎవరికి తీపి ఉండదు ? వెళ్ళండి, వెళ్ళండి."

మందిరం వెనకనుంచి గౌరాంగుడు తాపీగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

వచ్చిన మనిషి తొందర పెడుతున్నాడని దాసివచ్చి మళ్ళీ అపర్ణను హెచ్చరిం



చింది. అపర్ణ దాసివెంట వెళ్ళి చూస్తే, వచ్చినమనిషి పోలీసుఅధికారికాదు – ఆమె పినతండ్రి ; ఆలయ ప్రతిష్ఠకు ఆహ్వానం అందుకుని వచ్చాడు.

## 5

ఎప్పటిలాగే బాసుల్‌పూరు స్టేషనుమాస్టరు తెల్లవారుగట్ల రైలు వెళ్ళిపోగానే లాంతరు ఎత్తిపట్టుకుని ఎవరికోసమో తెగచూస్తాడు తూర్పు తెల్లవారేదాకా అలా చూస్తూనే ఉంటాడు. తరవాత దీపం ఆర్పేసి వెతకడం మానేస్తాడు. తిరిగి సాయంకాలం నాలుగుగంటలబండి వెళ్ళాక మళ్ళీ ఎవరికోసమో చూడడం ప్రారంభిస్తాడు. అప్పు డాయనవెంట బాదల్ కూడా ఉంటాడు.

వాళ్ళిద్దరూ గౌరాంగుడికోస వచ్చేపొయ్యే ప్రతిబండినీ నిరీక్షిస్తున్నారు. మేస్టరు పత్రికలో గౌరాంగుడికి ఒక ఉత్తరంకూడా అచ్చు వేయించాడు. కాని ఫలితం శూన్యం. రైళ్ళు వస్తున్నాయి, పోతున్నాయి. ఏ ఒకరైలునుంచీ గౌరాంగుడు దిగటంలేదు.

నీలాటిరేవులో నిభాననిని అమ్మలక్కలు, "అల్లుడిజాడ ఏమైనా తెలిసిందా ?" అని అడుగుతారు. "అయినా మీరంత శ్రద్ధగా వెతుకుతున్నట్టు లేదులే," అని ఎత్తిపొడుస్తారు.

"ఊళ్ళో మాకన్న ఎంతో శ్రద్ధ ఉన్నవాళ్ళుండగా భోగట్టా తెలియ కేం జేస్తుంది? మా శక్తికిమించి మేం ఏమీ చెయ్యలేంగదా !'' అంటుంది నిభానని

ఘోషాల్ కుటుంబంలో ఏనాడో ఒకవింత జరిగింది దాని స్వభావం ఏమిటో ఊళ్ళోవాళ్ళ కింతవరకూ అంతుచిక్కలేదు అందుకే వాళ్ళ కీ ఆరాటం ఆ రహస్యం ఏమిటో, అల్లుడు తిరిగివస్తే బయట పడుతుందని వాళ్ళ ఆశ

తండ్రికోసం బాదల్ పడే ఆరాటం స్టేషనుమాస్టరుకు తెలుసు, వాసంతికి తెలుసు.

చివరకు గౌరాంగుడు బాసుల్‌పూరుకు తిరిగి రానేవచ్చాడు. అతను స్టేషను మాస్టరు కంటా, బాదల్ కంటా పడకుండా తిన్నగా పోలీసుస్టేషనుకు వచ్చి, ఇన్‌స్పెక్టరుతో తాను హత్య చేశాననీ, తనకు ఉరిశిక్ష విధించమనీ అన్నాడు.

అత నెవరో పిచ్చివాడని పోలీసుఅధికారికి అనుమానం వచ్చింది.

''హత్య ఎక్కడ చేశావు?'' అని అధికారి అడిగాడు.

''ఇక్కడే, బాసుల్పూరులోనే," అన్నాడు గౌరాంగుడు

"నాకు తెలీకుండా నా యిలాకాలో హత్య ఎలా జరుగుతుంది ? నీపేరు ?"

"గౌరాంగప్రసాద భట్టాచార్య. నేను శశిధర్ ఘోషాలును హత్య చేసి పరారీ అయాను."

"నామాట విని, ఎవరన్నా మంచి ఆయుర్వేదవైదుడిదగ్గిర కొంతకాలం మందు తిసుకో. నీబుర్ర పూర్తిగా చెడిపోయింది ''

''నాకు సాక్షు లున్నారు. స్టేషనుమాస్టరుగారి నడగండి కావలిస్తే."

స్టేషనుమాస్టరును పిలుచుకురమ్మని పోలీసుఅధికారి మనిషిని పంపాడు. మాస్టరు గొడుగు చంకనపెట్టుకుని వస్తుండగా ఆమనిషి చెప్పాడు "వట్టి పిచ్చివాడు మాస్టరుగారూ ! రోజూ ఆఫీసుకు వెళ్ళొస్తున్న శశిధరఘోషాల్‌ను తాను చంపాట్ట ! మీరు సాక్ష్యంట !''

## *6*

శశిధరుడు చావలేదు. కాని రెండుమాసాలు మంచమెక్కాడు అతనికి తగిలిన గాయం చిన్నదేమీకాదు అతను ఎత్తినకత్తి జారి అతని మెడమీదనే పడింది. చాలా రోజు లతనికి స్పృహలేదు స్పృహ రాగానే అతనికి తనమీద చాలా అసహ్యంవేసింది.

అతను పునర్జన్మ ఎత్తాడన్నారు అందరూ.

నిజానికి అతను పూర్తిగా మరొక మనిషి అయాడు. అతని కిప్పుడు వాసంతి ఒక దేవతలా కనిపిస్తూంది. ఆమెనుగురించి అత నిక అపోహ పడలేదు. ఆ రాత్రే అతనికి బుద్ధి వచ్చింది ఎంతో హాస్యాస్పదమైన సన్నివేశానికి తాను ఉగ్రుడై పోయి ఆవేశంతో హత్యకు ఒడిగట్టాడు. అది తలచుకున్నప్పుడల్లా అతనిప్రాణం

చచ్చినట్టవుతుంది బావమరిది పరారీ కావటం అతన్ని బాధిస్తున్నది అతను పత్రికల్లో వేయించాడు

అత నలాంటి పత్రికలు చదవడు ఎప్పుడో అతనే వస్తాడు మీరు దిగులు పడకండి," అనేది వాసంతి

నిభానని కున్న దిగులల్లా తన అల్లుడు ఆత్మహత్య చేసుకుని తన కూతురికి వైధవ్యం కలిగించాడేమోనని

భర్తకు ఉపచారాలు చేసే కాలంలో వాసంతి తన మనస్సు విప్పి చెప్పగలిగింది

"అతన్ని మీ రెలా అపార్థం చేసుకున్నారు? పదేళ్లుగా చూస్తున్నారే! పశువుకూ, దేవుడికీ ఉండే తేడా గ్రహించలేరా? అతనిలో ఏ కోశానన్నా స్వార్థం ఉందా? అతన్నిమటుకే సందేహించారా? నన్నూ సందేహించారు దేనికి? భార్యను, గుప్పిట్లో వుండే వస్తువును, నన్ను ఆత్మహత్యకు ప్రేరేపించేదాకా వేళ్ళే అధికారం మీ కున్నది ..... నే నతన్ని ప్రేమిస్తున్నాను. ప్రేమ అంత చెడ్డదా? బాదల్‌ని ప్రేమిస్తున్నాను - ఔనా? మనిషిమీద మనిషికి అభిమానం ఉండటం తప్పా? మీ ఇంట్లో మనుషులు పనిచేసే యంత్రాలు - కాపరానికి వచ్చిన దగ్గిర్నుంచీ చూస్తూనేవున్నాను - ఓ సరదాలేదు, సంతోషంలేదు మిమ్మల్ని చూస్తే నా ప్రాణం గడ్డకట్టుకుపొయ్యేది ఒక్క అతనిలోనే జీవం వున్నది అంచేత నా కతను నచ్చాడు అంటే నే నతనితో లేచిపోతాననా? నవ్వుతూ రెండు మాటలు పైమనిషితో మాట్లాడితేనే ఎగిరి చక్కాపోయే పాతివ్రత్యం ఉంటే నేం, పోతే నేం? మీ ప్రేమ ఏం ప్రేమ? దానికి విశ్వాసమేలేదు అనుక్షణం అవమాన పడుతూ, గదిలోపెట్టి తాళంవేసి ఉంచుకున్న భార్యతో కాపరం చెయ్యటం మటుకు ఘనమా? ఈ శరీరపు తిత్తిని బంధించవచ్చు మనస్సు పైవాళ్ళమీద పోతే ఏం చెయ్యగలరు? . మీరు జమీందార్ల కొలువు చేస్తున్నారు వాళ్ళకూ మీకూ మధ్య పరస్పర విశ్వాసం వుంది, గనుక చెయ్యగలుగుతున్నారు అకస్మాత్తుగా వాళ్ళు మీకు దొంగతనం అంటగడితే మీ కెలా వుంటుంది?" .

శశిధర్ పూజకు కూర్చుని ఉండగా బాదల్, "నాన్న వచ్చాడు! నాన్న వచ్చాడు!" అని కేకలు పెట్టడం వినిపించింది

"వాసంతీ, ఎవరికైనా పండుముత్తైదుకు తాంబూలం ఇచ్చిరా. అతనికోసం తాంబూలవ్రతం చేద్దామనుకున్నాను," అని నిభానని కేకలు పెట్టుతున్నది

గౌరాంగుణ్ణి వెంటతెచ్చిన పోలీసుఅధికారికి మిఠాయి మస్తుగా పెట్టారు ఆడవాళ్లు.

బాదల్ వెళ్ళి తండ్రిఒడిలో కూర్చున్నాడు స్టేషన్‌మాస్టరు తిష్ఠవేసి కూచుని, గౌరాంగుడి కథంతా వినందే వెళ్ళేటట్టులేదు

రాత్రిదాకా భర్త తనకు ఒంటరిగా దొరకడేమో ననుకుంటున్నది సుధ

వాసంతి గౌరాంగుడి ముఖంలోనూ, శరీరచ్ఛాయలోనూ కలిగిన మార్పుకు విచారిస్తూ, తనభర్త తనను శంకించినందుకు తప్పుపట్టడం సరికాదేమో ననుకున్నది అయినా ఆమె తనది తప్పునుకోలేదు స్త్రీలు పురుషులతో స్నేహంగా ఉండవచ్చు - సాహసంఉంటే ఆ సాహసం వాసంతికి ఉన్నది స్త్రీ స్వభావంపట్ల ఆదరం లేనివాళ్ళే అలాటి స్నేహాల్ని వ్యతిరేకిస్తారు స్త్రీకిమాత్రం స్నేహతృష ఉండదా?

తనమీద అపారమైన దయ ఉండడంచేతనే శశిధరుడు చావలేదనుకున్నాడు గౌరాంగుడు - అతను బతికిఉండడం తనకు ఉద్ధరింపు అయినట్టు తన బావమరిది తిరిగి వచ్చాడన్న కృతజ్ఞతాభావం శశిధరుడిలోనూ ఉన్నది అతను బాదల్‌తో "ఏమిట్రా ఆ గుస గుసలూ? నాన్నదగ్గిర మామను బాగా తిడుతున్నావా?'' అన్నాడు

''లేదు, లేదు ఈరాత్రే నాటకసమాజం పెడదామంటున్నాడు,'' అన్నాడు గౌరాంగుడు

మాస్టరు తన నాటకాలన్నీ తగలబెట్టానని చెప్పేసరికి అతను నొచ్చుకున్నాడు కావలిస్తే అన్నీ మళ్ళీ రాయగల నన్నాడు మేస్టరు

"చచ్చిబతికాడు పునర్జన్మ ఎత్తాడనాలిసిందే,'' అన్నది నిభానని తన కొడుకు గురించి

సంభాషణ ఆప్యాయంగా, అరమరలు లేకుండా సాగిపోయింది *



# 'వశీకరణమంత్రం'

"భార్యాభర్తల మధ్యన అనురాగాన్ని పెంపొందింపజేసే అద్భుతశక్తి గల ఉంగరం . భర్తను భార్య, భార్యను భర్త తమ మాట వినేలా, అనేక లోహములను సమపాళ్ళలో మిశ్రమం చేసి తయారుచేసిన ఉంగరం గ్యారంటీ... నచ్చనిచో మీ డబ్బు వాపసు యివ్వబడును యీ ఉంగరం మీచెంత వుంటే చాలు... ఎదుటివారు మీ ప్రభావానికి లొంగిపోగలరు......ఎంతటి గయ్యాళి భార్య అయినా మీ మాట వచ్చినట్లు వింటుంది .."

పేవ్ మెంటుమీద టేబిల్ నిండా ఉంగరాలు పరుచుకుని అరుస్తున్న వాడి చివరి మాటలు నాకు బాగా నచ్చాయి ..అప్పటికే వందలాది మంది ఎగబడి ఉంగరాలు కొంటున్నారు చూస్తుండగానే రద్దీ ఎక్కువైపోయింది... పిల్లలు ముసలివారు .. ఆడా... మగా. . అన్ని రకాలవారూ ఎగబడి కొంటున్నారు

చాలా చవక నేపాల్ లో మంత్రించబడిన ఉంగరాలు రెండ్రూపాయలు మాత్రమే .

నేను క్షణంసేపు ఆలోచించాను ఒక్కసారి ఈసాయంత్రపూట యింట్లో వంట ప్రయత్నాలు చేస్తున్న కమల గుర్తుకు వచ్చింది

కొంతమంది మనుష్యులు కేవలం అర్థంకాకుండా మాట్లాడడానికే పుడతారనేది నిజం: నీవు చెప్పింది నిజమైనప్పటికీ దాన్ని కాదనడమే వాళ్ళ ప్రధానలక్ష్యం : : అయితే నువు చెప్పిందానికన్నా వాళ్ళు ఏదో గొప్పగా ఆలోచించి చెప్పే దేమీ ఉండదు అయితే నువు చెప్పిందానినే తిరిగి వాళ్ళ మాటలలో నీకే చెప్పడం వాళ్ళలోని ప్రత్యేకత సరిగా యీ కోవకు చెందినదే మా శ్రీమతి (కమల)

ఇక ఆలోచనకు స్వస్తి చెప్పి, రెండు రూపాయలు చెల్లించి ఉంగరం కొన్నాను 'ఇది మీదగ్గిర వుంటే చాలు: దాని మహిమ అలాంటిది '

---

'రుక్మిణి'

రాత్రి పదిగంటలకు యింటిదారి పట్టాను .. యింట్లోకి అడుగు పెట్టానో లేదో శ్రీమతి కంఠస్వరం వినిపించింది.

"ఇంత పొద్దు పోయిందాకా ఎచట రాజకీయాలు వెలగబెట్టారు...టైం తెలీ దంలా ..''

నా వళ్ళు భగ్గున మండింది. ఇంకో మారైతే గప్‌చిప్‌గా దొడ్లోకి నడిచే వాడ్ని.... కాని నా జేబులో ఉన్న ఉంగరం విషయం గుర్తుకు వచ్చి అట్లాగే ఓ క్షణం కమల మొహంలోకి చూశాను ... ఎందుకో ఏనాడూ లేని ధీమా దాని మొహంలో కనిపిస్తోంది.

"ఏం, నీ ముందు కబుర్లు చెబుతూ కూర్చోవాలా.. నా యిష్టం...ఎక్కడో ఓ చోట నా యిష్టమైన పనులు చేస్తాను. నీ కేమీ సంజాయిషీ యివ్వాల్సిన అవ సరం నాకు లేదు.''

''నా కివ్వక పోతే యింకెవరి కిస్తారు. అడ్డమైన చాకిరీ చేసి కండ్లలో వత్తులు వేసుకుని మీ కోసం ఎంత సేపని కాచుకు కూర్చోవాలి.''

"ని న్నెవడోయ్ కూర్చోమన్నది. ఇంటికి రాగానే వెధవ సాధింపులు;" ఏనాడూ ఎదురుతిరిగి మాట్లాడని నా నోటి వెంట మాటలు బాణాల్లా వచ్చేస్తు న్నాయి...ఉంగరం ప్రభావం అది.

"నా మొహాన యిలా వ్రాసుంది కాబట్టే యిలా ఏడుస్తున్నాను. పైగా ఏనాడూ లేనిది యిదొహటా... నేను వెధవనే...అవున్లే అలాగే ఉంటుంది."

దానిగొంతు తారాస్థాయి నందుకుంది. ఇంతకుముందు ఏనాడూ అది అంత తీవ్రంగా ఎగబడినట్లు నాకు గుర్తులేదు. ఏవో ఒకటిరెండుమాట లని ఊర్కొనేది.

"మా ఇంటికి పోతే తెలిసొస్తుంది... ఈ పాడు కొంపలో బ్రతికేదానికన్నా చావడం మేలు.''

"ఏం కూశావ్ !'' నాకు తెలీకుం డానే నా చేయి ఆవేశంగా దాని చెంపను తాకింది...తర్వాత ఏడుపు...గొడవ .. ఛీ ఛీ...పాడుసంత...దొడ్లోకి పోయి మంచం వాల్చుకుని పడుకున్నాను. అపుడు వశీకరణశక్తి గల ఉంగరం గుర్తుకువచ్చింది. దాన్ని తీసి బావిలో పడేశాను. ఎలాగో ఆకలితో ఆ రాత్రి గడిచిపోయింది.

మర్నాడు ప్రొద్దున ఏవో బట్టలకోసం కమల పెట్టె వెతుకుతోంటె అడుగున నేను నిన్న కొన్నలాంటిదే ఒక మంత్ర శక్తి గల ఉంగరం కనిపించింది.

నేను తెల్లబోయాను.

# వ్యక్తిత్వం లేని మనిషి

### జరిగిన కథ

సంజీవరావుచేత చేతకాని దద్దమ్మ అనిపించుకొన్నది నిజం చెప్పేసికదా అని, సోమయాజులుతో అబద్ధాలన్నీ కోసిచెప్పి, అలా ఒక చేయరాని అఘాయిత్యం చేసినందుకు తిట్లు తిన్నాడు మృత్యుంజయరావు

కాని, తరువాత శేఖరంతో సినిమా కెళ్ళినప్పుడు అక్కడ శేఖరం మంజులతతో జరిపిన చేష్టలు, అతనిలోని చైతన్యాన్ని మేల్కొల్పినయి ఆరాత్రి ఆ చైతన్య ప్రోద్బలంతో మంజులత వేటకు బయల్దేరి రిజావాడిసాయంతో ఎలాగో అలా మంజులతను యింటికి తెచ్చుకొన్నాడు ఆమెతో తొలిసారిగా విషప్రణయం అనుభవించాడు

— ఇక ముందుకు సాగండి

లైటు వేశాడు మంచంమీదనుంచి లేచి గోడదగ్గరకు వెళ్ళి మృత్యుంజయరావు. తర్వాత అలమారాలోని వాచి తీసి టైము చూశాడు రెండయింది ఇన్నిపనులు చేసినా, యింత సేపు ఆలోచించినా, ఇంతహింస అనుభవించినా ఇంకా రెండేనా? మంచంవైపు చూశాడు

మంజులత ఒకప్రక్కకు తిరిగి గాఢనిద్రపోతూ కనిపించింది చీరె పూర్తిగా వూడిపోయింది. పరికిణీ స్థానభ్రష్టత పొందింది. రవిక, జాకెట్టు యివేవీలేవు వొంటిమీద

ఒక అయిదునిమిషాలపాటు అతను దృష్టి మరల్చకుండా అలాగే చూస్తూ నిలబడ్డాడు తను ఓ స్త్రీని నగ్నంగా చూస్తున్నాడు. పరిశీలిస్తున్నాడు దగ్గరకు వెళ్ళి తను చూడాలనుకున్నవన్నీ చూసేశాడు అతన్లో కోరికలు చెలరేగకపోగా చెడ్డ అసహ్యమేసింది ఈ ప్రపంచంమీద అసహ్యమేసింది తనమీద అసహ్యమేసింది

"భగవంతుడా! ఇంకెప్పుడూ వ్యభిచారం చెయ్యను. నన్ను క్షమించు ఎప్పుడూ–ఎప్పుడూ చెయ్యను,' అతని కళ్ళవెంట నీళ్ళుకారాయి అత నేడుస్తున్నాడు

ఈ స్పందన కలిగాక గదిలో ఆమె ఉనికి అతనికి దుస్సహంగా తోచింది ఆమె అగ్నిలా సెగలు విరచిమ్మింది ఉక్కిరిబిక్కిరయినట్లు, ఊపిరాడనట్లు బాధ పడ్డాడు ఆమెదగ్గరకు వెళ్ళి బుజంమీద చేయివేసి తట్టి లేపాడు

ఆమె బద్ధకంగా కళ్ళు విప్పి దీపకాంతి చూడలేక మళ్ళీ మూసేసుకుని, "ఏమి

---

కొమ్మూరి వేణుగోపాలరావు

టిది ? లైటెందుకు వేశారు ? ఆర్పివేయండి బాబూ !" అంది ముఖం చిట్లించి విసుగ్గా

ఆమెని సాగనంపటానికి ఏలా బోధపర్చాలో తెలియక, "అదికాదు, అదికాదు" అంటూ తడబడుతున్నాడు

"ఏదికాదు ? మీ ఎత్తులన్నీ నాకు తెలుసులెండి ఇప్పు దేం కాదు నాకు నిద్ర ముంచుకొస్తూంది లైటు తీసేసెయ్యండి పడుకుందాం." అన్నా దామె కళ్లు తెరవకుండానే

అతను సంశయిస్తూ, నా ఉద్దేశం అదికాదు... చాలా రాత్రయింది ఇహ వెడితే నేం ?'' అనేశాడు

ఆమె బద్ధకాన్ని ఒదుల్చుకుని, లేచికూర్చుని ఒళ్ళు విరుచుకుంటూ, "అబ్బబ్బ ! చంపుతున్నారు బాబూ ! ఎంతయిందేమిటి ?'' అని అడిగింది

''రెండు దాటింది "

''ఓస్, దీనికేనా ఇంత హంగామా ! నాలుగింటిదాకా వుండాలని డప్పాలు కొట్టారుగా ''

''అన్నా ననుకో..."

"ఏ మనుకో ? ఇప్పుడు నాకు మంచి నిద్రవస్తోంది నేను కదల్లేనండీ సార్ మీకు పుణ్య ముంటుందిగాని ఆ లైటు తీసెయ్యండి కాసేపు నిద్రపోతాను,'' అని ఆమె మళ్ళీ పడుకోపోయింది

అతను కంగారుపడుతూ, "అదికాదు, ఇప్పుడు బిట్రగుంట రైలు వచ్చేవేళ అయింది అందులో ఇంటివాళ్ళు దిగితేదిగవచ్చు ఎందుకైనా మంచిది జాగ్రత్తగా వుందామనీ," అంటూ నసిగాడు

"అందుకే యీ మొగాళ్ళనిచూస్తే నా కసహ్యం," అంటూ ఆమె చర్రున లేచింది. "ఈ తెలివితేటలు ఇందాక ఏమైపోయినాయో,'' అని లేచి నిలబడి గబగబా చీరె చుట్టబెట్టుకుంటూ, ''తీసుకురండి రిక్షావాడ్ని నా పీడ వదుల్చుకుందురుగాని," అంది రుసరుసలాడుతూ

బ్రతుకుజీవుడా అని అతను బయటపడ్డాడు రిక్షా దగ్గర్లోనే ఓ చెట్టుక్రింద కనిపించింది దగ్గరకు వెళ్ళాడు తోగులు సీటులో ముడుచుకుని పడుకుని, దుప్పటి కప్పుకుని నిద్రపోతున్నాడు భుజంతట్టి లేపాడు

తీరా వాడ్ని తీసుకుని యింటిగుమ్మం వరకూ వచ్చాక, గదిబయట నిలబడి







ఎదురుచూస్తూన్న మంజులత "ఏమిటి దిక్కులు చూస్తున్నారు ? మీరుకూడా రిక్షా ఎక్కండి తలుపు తాళం వేసి." అంది మెట్లు దిగుతూ

"నే నెందుకూ ?" అన్నాడు నసుగుతూ

"బాగుంది వరస ఈ అర్థరాత్రి చీకట్లో ఆడదాన్ని ఒక్కతినే పోనా ఏమిటి ? మీరు దగ్గరుండి తీసుకెళ్ళకపోతే నే నిక్కడ్నుంచి కదలనే కదల్ను." అం దామె దబాయింపుగా

"అవునుసార్ ! పక్కన మొగాళ్ళు లేకుండా ఒక్కదాన్ని చూశారంటే పోలీసోళ్ళు తెగ చిక్కు పెట్టేస్తారండీ. మీరూ రావాలి." అన్నాడు తోగులు ఆమెను బలపరుస్తూ

ఇహ లాభం లేదని గ్రహించి భగవంతుడిమీద భారం వేసి, గది తాళం పెట్టి, ఆమెతోపాటు రిక్షా ఎక్కి కూర్చున్నాడు రిక్షా కదిలింది పోలీసువాళ్ళు – అతని కాళ్ళు వొణుకుతున్నాయి

ఈసారి మంజులత ఏమీ మాట్లాడటంలేదు కునికిపాట్లు పడుతున్నట్లున్నది

రిక్షా రెండు మూడు ఫర్లాంగులు దాటివుంటుంది అంతలో సరిగ్గా అతను భయపడ్డట్లే జరిగింది సైకిళ్ళు తొక్కుకుంటూ యిద్దరు పోలీసు కానిస్టేబిల్స్ ఎదురుగా వస్తూ రిక్షాని నిలవేశారు

అంతేకాదు – "ఏయ్ ! ఎవరు నువ్వు ?'' అని గర్జించాడు వారిలో ఒకడు

వాళ్ళు అవటానికి పోలీసువారే అయినా, చూడటానికి హంతకుల్లా వున్నారు వీధి దీపం వెల్తుర్లో వాళ్ళ కళ్ళు చింతనిప్పుల్లా గోచరించాయి జేవురించిన

ముఖాలతో, మెలితిరిగిన మీసాలతో భయంకరంగా వున్నారు వారి నోళ్ళనుండి భరించరాని వాసన వస్తున్నది

"గాడిదలు - తాగారు" అనుకున్నాడు గడగడమని వణుకుతున్నాడు ముచ్చెమటలు పట్టి దేముళ్ళకి మొక్కుకుంటున్నాడు. ఆ సమయంలో అతను ఆస్తికుడు.

తోగులుకూడా రిక్షా దిగి దణ్ణాలు పెడుతూ నిలబడ్డాడు

మంజులత విశ్రమత్తు వదిలి కళ్లు పెద్దవిచేసి చూస్తున్నది.

"ఎయ్ ! ఎవరును వ్వంటే మాట్లాడవేం ? వొళ్ళు తిమ్మిరిగావుందా ?" ఒకడు టార్చిలైటు రిక్షాలోకి ఫోకస్‌చేశాడు "ఓ ! యీ మహాతల్లా ! ఎంత ముట్టచెప్పావు నాయనా ? చెప్పు నీ పేరేమిటి ?"

'చెప్పను' అందామనుకున్నాడు కాని "ము ..ము మృత్యుంజయరావు," అవి చెప్పాడు

"ఎక్కడ నీ యిల్లు ?"

గొంతు తడారిపోతోంది. అయినా ఎలాగో ఓపిక చేసుకుని చెప్పాడు

"ఏంపని చేస్తావు ?"

చెప్పాడు

"ఇలాంటి వెధవపన్లు చేయకపోతే, పెళ్ళి చేసుకుని ఏడవకూడదట్రా ?" అన్నాడు ఒకడు

అతనికి దిమ్మతిరిగింది ఏమిటి ? తనని 'రా' అంటున్నాడు అసభ్యంగా

'జాగ్రత్తగా మాట్లాడు తెలుసా ?' అందా మనుకున్నాడు కాని "త త... ప్పయి పోయింది," అన్నాడు ఈ ఆపదనుంచి ఏదోవిధంగా బయటపడితే చాలు, ఇప్పు డెంత అవమాం పాలయినా, అంతగా అయితే జరిగిన అవమానం గురించి తర్వాత బాధపడవచ్చు

"ఏమిట్రా ఫూల్ - గుడ గుడ మంటావు? ఈ ఘనకార్యం చెయ్యటానికి ముందే ఏమయినాయి యీ తెలివితేటలు ?"

"అరేయి, వాడికి నీతులు బోధిస్తావేంట్రా? స్టేషన్‌కి తేసుకెళ్ళి మూసేద్దాంపద"

"అరేయి, రిక్షా యిటు తిప్పరా"

ఆంజనేయస్వామి, పడ్డికాసులవాడు, భద్రాద్రి శ్రీరాముడు, వేంకటాద్రి నరసింహుడు - అందరికీ మొక్కులు రక రక మొక్కేస్తున్నాడు ఒకవైపు ఏ్రం తేలికై పోతోంది కళ్ళు తిరిగిపోతున్నాయి

ప్రక్కనుండి మంజులత మోచేత్తో పొడిచింది "అలా చూస్తా రేమిటంనేదీ ష్టి




బొమ్మలా ? వాళ్ళమొహాన ఓ అయిదురూపాయలు పారేసి ఎలాగో గట్టెక్కించండి,'' అంది నిమ్మదిగా

మృత్యుంజయరావు కళ్ళముందు ఓ ఆశారేఖ తళుక్కుమని మెరిసింది గబగబ చెయ్యి జేబులోపలకు పోనిచ్చి చేతికందిననోటు బయటకి లాగాడు చాలా చాకచక్యంగా మాట్లాడా లనుకున్నాడు వాళ్ళకు లంచం యిస్తున్నట్లు ఎవరికీ అనిపించకూడదు. అయినా వా ళ్ళది తీసుకుని తనని విడిచిపెట్టాలి

కాని వొణుకుతూన్న చేతిని గాలిలో చాచి అట్టేపెట్టాడు నోటు గాలికి రెప రెప లాడుతోంది ఎంత సేపటికీ నోట్లోంచి మాటరాదు

"ఏమిటి చేస్తున్నాడు ? ఎందుకలా చెయ్యి పెట్టాడు ?"

''పదిరూపాయిల కాయితం మనకి ముట్టచెబుతున్నాడు '

' అవును, ఆవిషయం నోటితో చెప్పొచ్చుగా '

"వొణికి చస్తున్నాడ్రా నోరు పెగలటల్లేదేమో."

"అలవాటు లేదనుకుంటాన్రా అమాయకుడిలా వున్నాడు పోనీ విడిచి పుచ్చేద్దామా ?''

ఒకడు ఆనోటుని చేతిలోంచి చటుక్కున లాగేసి, జేబులోకి తోసుకున్నాడు

"ఇదిగో మిస్టర్ ! యిది ప్రథమతప్పుగా భావించి, మన్నించి వొదిలిపెడుతున్నాం

ఇంకెప్పుడైనా యిలా కనిపించావా - జాగ్రత్త నీఅంతు చూస్తాం అరేయి రిక్షా! తొరగా తీసుకెళ్ళి దింపెయ్యరా "

"రారా! ఇంకో పెగ్గేసుకువద్దాం"

సైకిళ్ళు తూలుతూ కదిలాయి రిక్షాకూడా మెల్లిగా బయల్దేరింది

తర్వాత ఏం జరిగిందో మృత్యుంజయరావుకు సరిగ్గా తెలియదు. మంజులత ఏదో గొణుక్కుంటున్నది "అమాత్రం చేవలేనివాళ్ళు ఎందుకు తీసుకురావాలి?" అంటున్నది తోగులుకూడా సణుగుతున్నాడు

చివరకు రిక్షా ఆమెయింటికి చేరింది క్రిందకి దిగబోతూ ఆమె ఏమనుకుందో, అతని చుబుకాన్ని పట్టుకుని పైకెత్తుతూ "ఏమండీ! జరిగినదానికి బాధ పడుతున్నారా?'' అంది

నిర్జీవంగా వున్న ముఖాన్ని ఆమెనుండి విడిపించుకునేందుకు ప్రయత్నిస్తూ లేదన్నట్లు ఒక అయోమయమైన సౌంజ్ఞ చేశాడు

ఆమె రిక్షా దిగింది ఒకక్షణం అతని ముఖంకేసి చూసి "శేఖరంగారికి-మరిచిపోకండేం,'' అంటూ గుమ్మం ఎక్కి- దగ్గరగా వేసివున్న తలుపుల్ని తోసి లోపలకు వెళ్ళిపోయింది

## 7

ఉన్నట్లుండి జగతిలో తనకు తెలియనిస్త్రీ గోచరించసాగింది ఈరకమైన జగతిని అతను జన్మించినదాదిగా ఇంతవరకూ చూడలేదు తెల్లవారుఝామునే నిద్రలేస్తుంది తలారా స్నానమాచరిస్తుంది ఈమధ్య సూర్యనమస్కారాలు ప్రారంభించింది ఉదయించే బాలభానుడిని సందర్శిస్తూ, యినుడి లేతకిరణాలు మీద పడుతూండగా, ధవళవస్త్రం ధరించి, భూమిని తాకేటట్లువుండే శిరోజాలు విరబోసుకుని, నుదుటన కుంకుమ రక్తంలా మెరుస్తూండగా, పాలరాతివంటి ఆమెదేహం నీరెండలో మిల మిల లాడుతూండగా, మృదుగంభీరమైన కంఠంతో మంత్రాలు చదువుతూ ఆమె సూర్యనమస్కారాలు ఆచరిస్తూవుంటే ఆ దృశ్యం చూడటానికి ఆతని రెండుకళ్ళూ సరిపోయేవికావు.

కొన్నాళ్ళక్రితం అతనకీ భక్తి పుట్టుకువచ్చింది సూర్యభగవానుడిమీద కాని తాను చేస్తూండగా నలుగురూ చూస్తారనీ, వ్యాఖ్యానించుకుంటారనీ సిగ్గూ, సంకోచం చొక్కా-లేకుండా అందరిఎదుటా నిలబడటం యిష్టంలేదు అందుకని గదిలో దూరి కిటికీలోంచి సూర్యుడ్ని సందర్శిస్తూ చేసేవాడు అసలు ఏకాగ్రత కుదిరేదికాదు. గదిలో తలుపులు బిడాయించుకుని, ఒక్క- కిటికీమాత్రం తెరిచివుంచి




సూర్యనమస్కారాలు చేసే విచిత్రజీవి యీ భూమ్మీద తాను ఒక్కడేనన్నభావం కృంగదీస్తూ వుండేది తను చేసేపనిలో తనకే నమ్మక ముండేదికాదు అసలు సూర్యుడు ఒక గోళంకదా గ్రహాలలాగా, భూమిలాగానే శాస్త్రప్రకారం మంటలతో నిండివున్న ఒక ప్రదేశంకదా అదికూడా పూజించట మేమిటి అన్న మీమాంస ఉదయించేది అతని నాలిక మంత్రాలు ఉచ్ఛరిస్తూన్నా, అతనిశరీరం కదలికలు జరిగిస్తూన్నా, చేస్తున్నంత సేపూ యీ తర్జన భర్జనే. పైగా యీ ఆలోచన మిగతా సమయాల్లో వచ్చేదికాదు అసలు యీ విషయంగురించి గుర్తే వుండేదికాదు సరిగ్గా సూర్యనమస్కారాలు ప్రారంభించటానికి పూనుకున్నప్పుడు ఉత్పన్నమయేది అవి కొనసాగినంత సేపూ అదే సంఘర్షణ ఈ మానసిక సంక్షోభంతో అలిసి సొలిసి అతనికి నీరసంకూడా వచ్చేది

అసలు భగవంతుడు ఉన్నాడా అన్న పెద్ద ప్రశ్నే ఎదురయేది. అతనికి వున్నాడన్న నమ్మకమూ లేదు, లేడన్న నిస్సంకోచమూ లేదు. ఒకరోజు వున్నాడనిపిస్తుంది మరోరోజు లేడనిపిస్తుంది అర్ధరాత్రి మెలకువ వచ్చి భయంతో శరీరం గగుర్పొడిస్తే వున్నాడు ఆఫీసులో నలుగురిమధ్యా కూర్చుంటే లేడు ఒక్కోసారి ఎవరైనా గట్టి నాస్తికుడ్ని చూస్తే - ఓహో! వీడెంత మొనగాడురా అనిపిస్తుంది మళ్ళీ విభూతి, రుద్రాక్షలు ధరించి, శ్రీచూర్ణం దిద్దుకుని బ్రహ్మతేజస్సు ఉట్టిపడే భక్తు డెవరైనా ఏ దేవాలయం దరిదాపుల్లోనో దృగ్గోచరమైతే - ఆహా! యీయ నెంత మహానుభావుడురా అనిపిస్తుంది

కాని జగతిలాంటి స్త్రీ, శుచియై, స్నాతయై, కరాలు ముకుళించి, ఆ కాంతిలో, కాంతుల్తో తన మనోరరూపం ద్విగుణీకృత మౌతుండగా, భూమిపై వెలసిన దివ్యాంగనలా కనబడుతూవుంటే ఆమె చిత్తశుద్ధికి, ఏకాగ్రతకు అతను విస్మయ చిత్తు డవుతూవుండేవాడు

"మంచిపని అయినా పెద్దవాళ్ళచేతనే నిర్వర్తించబడుతుంది నాలాంటి పిరికి వాళ్ళు ఏ పని చేయటానికైనా తగరు-తగరు," అని ఆక్రోశించాడు

'రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతం

పూజయశ్వం వివస్వత్వం భాస్కరం భువనేశ్వరం'

అని ఆమె మృదుస్వరంతో, గంభీర ఉచ్చారణతో ఆదిత్యహృదయం పఠిస్తూ ఉంటే అతని హృదయం పాదాల మ్రోల దాసోహమంది చాటుగా కళ్ళు తుడుచు కునేవాడు

* * *

జగతే ప్రార్థన ముగించాక కాఫీ తయారు చేసేది. మృత్యుంజయరావు ఈమధ్య వంటసామాను పట్టుకొచ్చాడు. జగతి వచ్చీరాని వంటకూడా మొదలుపెట్టింది ఇంటావిడకూ, ఆమెకూ జోస్తీ ఎక్కువయింది కాబట్టి చాలాభాగం కూరలూ, పచ్చళ్ళూ ఆవిడే పంపిస్తూవుండేది జగతి ఒక రహస్యం కనిపెట్టింది ఇంటా విడతో ఏ విషయాన్ని గురించయినాసరే వాదించకుండా ఆవిడన్నదానికి ఔనంటే ఆవిడ ఉబ్బితబ్బిబ్బయి యిల్లంతా దోచిపెడుతుంది. ఈ కీలకాన్ని ఆమె తెలివిగా వుపయోగించుకుంటోంది జగతి స్వంత జీవితాన్ని గురించి ఆమె ఏమి అడిగిందో, ఈమె ఏమి సమాధానం చెప్పిందో మృత్యుంజయరావుకు తెలియదు

ఒక కనుచీకటివేళ మృత్యుంజయరావు సందులోంచి నడిచి పెరట్లోకి వెడుతూంటే యింటావిడ ఎదురొచ్చింది ఓ మృదుసుగంధం అతని వైపు వీచి ఆనంద పరవ శుడ్ని చేసింది అది సెంటూ, నైట్ క్వీన్ కలిసి వ్యాపింపచేసిన సౌరభం. అతను చకితుడై వెనుదిరికి చూశాడు చీకట్లో యింటావిడ రూపం లీలగా గోచరించింది శిగలో తురుముకున్న పువ్వులు తెల్లగా మెరిశాయి.

ఆ రాత్రి జగతి యీ విషయం ప్రస్తావిస్తూ "ఆవిడ ముస్తాబై నడుస్తూండగా ను వ్వెదురొచ్చావటగా ఆవిడ సిగ్గుపడి చచ్చిందిరా 'అళ నేమన్నా అనుకున్నా డేమో'నని మహాయిదయిపోతోంది 'పర్వాలేదులెండి మావాడికి యిలాంటివి పట్టవు' అని ఊరడించాను," అంది

"నిజంగా నాకు ముచ్చటేసింది" అన్నాడతను. ఈ మధ్య అక్కగారితో కలిసి

జీవిస్తూండటంవల్ల యిటువంటిమాటలు మాట్లాడటానికి కొంచెం చనువుకూడా ఏర్పడింది.

ఆమె ఒక క్షణం మెదలకుండా ఊరుకుని "ఆవిడ చాలా రసికురాలురోయి. ఆమాట కొస్తే వాళ్ళిద్దరూ రసికులే!" అంది, ఒకవిధమైన హర్షం కంఠంలో ధ్వనిస్తూండగా.

"ఆయన, పాపం, గుండెజబ్బు మనిషి."

"ఇప్పుడు. ఒకప్పుడు పెద్దాపురంలో వుండేవారట. ఆ రోజుల్లో దీనికి రెట్టింపు ఆస్తిపాస్తు లుండేవిట. అసలీవిడ రెండోభార్య అన్నమాట. రెండోభార్య లెప్పుడూ అందంగా వుంటారు - నువ్వు గమనించినావో లేదో. మొదటి కళత్రం పోతే చిలుకమ్మగార్ని చేసుకున్నాట్ట. అయితే అప్పటికే ఆయన రసికాగ్రేసరుడు. సాయంత్ర మవగానే స్నానం గీనం చేసి, తింగురంగా అని ముస్తాబై, బట్టలకు సెంటు పులుముకుని బోగంవీధిని పడేవాడట. ఈవిడ అందమంతా అడవిగాచిన వెన్నెల అయిపోతూండేది. అయితే యీవిడ్ని పీలు చూసుకుని మురిపిస్తూ వుండేవాడటలే. అప్పట్లో యీవిడ అత్తగారు బ్రతికివుండేదిట. "వాసేవ్, కోడలుపిల్లా! నువ్విలా మెతగ్గా వూరుకుంటే వాడు మితిమీరుతున్నాడు. వాడు చెడతిరిగి అర్ధరాత్రి యింటికి చేరినప్పుడు, అరచి గీపెట్టినా తలుపు తీయకు," అని బోధించేదిట. ఈవిడ అలాగే అని పడుకుని, ఆయన అడుగల సవ్వడి వినీ వినగానే తటాలున లేచి తలుపు తీసేదట. 'నాదీ మంచి వయసు. కోరికలు వుండవా? అందుకని నా స్వార్థంకోసం తలుపు తీసేదాన్ని, అంటుం దామె,'' అన్నది జగతి.

మృత్యుంజయరావు పడుకుని ఆసక్తిగా వింటున్నారు. బయట చినుకులు పడుతున్నాయి. చిరుగాలి తరంగాలు కిటికీగుండా లోపలకు ప్రవేశించి మృదువుగా సోకుతున్నాయి. ఈ ఆహ్లాదపూర్వక వాతావరణంలో అక్కాతమ్ము ళ్ళైన యిరువురు వ్యక్తులు ఓ గదిలో పడుకుని యితరుల అంతరంగిక విషయాలు ముచ్చటించుకోవటం అతనికి ఉల్లాసం కనిపించింది.

జగతి కంఠంవరకూ దుప్పటి లాక్కుని యింక చెప్పసాగింది. "ఇంకా చాలా రహస్యాలు కనిపెట్టాను. ఆయన గుండెజబ్బు మనిషికదా. సాధ్యమైనంతవరకూ ప్రాపంచిక సుఖాలకు దూరంగా వుందామని తాపత్రయ పడతాడు. అసలు వాళ్ళిద్దరూ ఓ గదిలో పడుకోరు. ఆవిడ పిల్లాడ్ని వేసుకుని ముందుహాల్లో పడుకుంటుంది. ఒక్కో రోజు హఠాత్తుగా వాళ్ళు ఏర్పాటుచేసుకుంటారు. ఆ ఏర్పాటు కళ్ళతో చేసుకుంటారో, మాటలతో చేసుకుంటారో నాకైతే తెలీదు. ఆరోజు సాయంత్రం ఆవిడ అభ్యంగన

స్నాన మాచరిస్తుంది. సెంటు పూసుకుంటుంది. శిగలో పువ్వులు తురుముతుంది. కనుచీకటి పడేవేళ అయినప్పట్నుంచీ గదిలో అగరొత్తులు ఘుమ్మని వెలుగుతూంటాయి. సెంటూ, అత్తరూ సరేసరి. పాపం పిల్లాడికి అరోజు ఒంటరిపడకే శరణ్యం,'' అని కిలకిల నవ్వింది.

మృత్యుంజయరావుకు సిగ్గేసింది. అక్కలో రెండు జగతు లున్నా రనుకున్నాడు. ఛీ, ఆడవాళ్ళిలా మాట్లాడతారా అనుకున్నాడు.

''అయితే యివేళ ఆవిడ అలంకరించుకుంది - ఓహో!'' అనుకున్నాడు.

జగతి వాళ్ళ కుటుంబవిషయాలు యింకా ముచ్చటించసాగింది: ' ఆవిడ కేమో తమ్ముడికొడుకుని పెంచుకుందామని ఆరాటం. ఆయనికేమో యీవిడవైపువాళ్ళు అంటేనే గిట్టదు. దీన్నిగురించి తరుచు తర్జన భర్జనలు పడుతూంటారు.''

కాసేపున్నాక జగతి నిద్రపోయింది. ఆమె యీరోజు యిటువంటి విషయాల గురించి మాట్లాడటం అతనికి విస్మయాన్నే కలిగించింది. ఎందుకంటే ఒక్కరోజు కూడా విడవకుండా ఎంతో శ్రద్ధాభక్తులతో ఆమె ఆశ్రమానికి వెడుతోంది. భాష్యానికి వెడదామని మొదట ప్రేరేపించిన చిలకమ్మగారు క్రమంగా వెళ్ళటం మానేశారు. అక్క ఎక్కడ్నుంచి తెచ్చుకుంటున్నదోగాని వేదాంత విషయాలకు సంబంధించిన పుస్తకాలు తెచ్చుకుని రోజూ పఠిస్తున్నది. చాలాసార్లు గంటల తరబడి గంభీరంగా ఆలోచిస్తూ మౌనముద్రలో వుంటున్నది. స్వామివారి గురించి తరుచు చర్చిస్తూవుంటుంది. ఎందుకనో యీనాడు యితరులకోసం స్థాయి దిగివచ్చి, కావాలని మాట్లాడినట్లు మాట్లాడింది. ఆశ్చర్యాన్ని సృష్టించటం ఆమెకు సరదా ఏమో!

''నువ్విక్కడ వున్నట్లు అమ్మకు ఉత్తరం వ్రాస్తాను,'' అన్నాడు ఒకసారి.

''వద్దు,'' అంది కఠినంగా. ''నాకు బుద్ధిపుడితే నేనే ఎప్పుడన్నా వెళ్ళిచూస్తాను. నా గురించి ఎవరికీ ఉత్తరాలు రాయకు.

అతను మళ్ళీ ఆ ప్రమేయం తలపెట్టలేదు.

తనతో అవసరం వుండి శేఖరం రెండుమూడుసార్లు గదికి వచ్చాడు. తను తప్పనిసరిగా అక్కను పరిచయం చేశాడు. అతన్తో ఆమె నవ్వుతూనే మామూలుగా మాట్లాడింది. శేఖరం అనాలోచితంగా లభ్యమయే యిటువంటి అవకాశాలను సులభంగా త్రోసిపుచ్చడని తెలుసు. అందుకే అతను భయపడ్డాడు. శేఖరం తమ యింటికి రావటాన్ని విసుక్కున్నాడు. కాని ఆమె మనసు ఎక్కువగా స్వామివారి మతాన్నిగురించేతప్ప యితరవిషయాన్ని పట్టించుకోకపోవటం అతనికి సంతృప్తి





కలిగించింది తర్వాత ఒకసారి జగతే అంది "మీ స్నేహితుడు శేఖరం నువ్వు లేని సమయంలో వచ్చాడ్రా అనవసరమైన సంభాషణ మొదలుపెట్టాడు తనో పెద్ద హీరో అనుకున్నట్లున్నాడు ప్రగల్భాలు కొడుతున్నాడు అధికప్రసంగాలు చాలించి బయటికి దయచేయమన్నాను నా గురించి తెలీదు తల్చుకుంటే ఇలాంటి వాళ్ళను కాలితో నేల రాచిపారేస్తాను ''

అతని కానందం కలిగింది 'ఓయ్! నీ పని అయిందా మిస్టర్ ఇదేం మంజులత వ్యవహార మనుకున్నావా ? మా అక్క ! ఆఁ, మా అక్క "

మృత్యుంజయరావుకు నిద్రవస్తోంది అతని కళ్ళలో మాలతి మెదిలింది నాటకం దగ్గర్లోపడింది నాలుగు రోజుల్లో వుంది రానురానూ ఆమె నటన రంగులు తీర్చుకుని సానపట్టిన వజ్రంలా ప్రకాశిస్తోంది ఆమె తండ్రి పశుపతి రిహార్సల్సుకు వస్తున్నాడు అక్కడున్న మనుషు లెవరికీ నాటకకళగురించి తెలియదని ఆయన దృఢవిశ్వాసం తరచు సోమయాజులుకూ, ఆయనకూ వాగ్వివాదం జరుగుతోంది మీకు తెలియదంటే మీకు తెలియదని అరుచుకుంటున్నారు మధ్యలో తురంగరావు కలగచేసుకోకపోతే, "నీకు తెలీదు నువ్వూరుకో, కుర్రాడివి." అని పశుపతిగారు మందలించారు అతను, పాపం, మళ్ళీ నోరెత్తటానికి సాహసించలేదు

ఒకసారి మాలతి అడిగింది, "మీ అక్కగారు వచ్చారటగా, చాలా యింటరెస్టింగ్ పర్సనాలిటీ అని విన్నాను చూపించరా ఒకసారి "




“అలాగే అవకాశం వచ్చినప్పుడు తప్పకుండా చూపిస్తాను ’’

“అన్నట్లు తలుపు వేశానా ?” ఒకసారి లేచి గడియ చూసివచ్చి పడుకున్నాడు

## *8*

నాటక ప్రదర్శన బాగానే జరిగింది టిక్కెట్లుకూడా వూళ్ళో ప్రజలకు బాగానే అంటగట్టారు ఊరి ఛైర్మన్‌గార్ని అధ్యక్షుడిగా ఆహ్వానించారు తురంగరావు. అతని డప్పుస్నేహితు డయిన ముకుందాన్ని ఏలూరునుండి ఆహ్వానించాడు వక్త క్రింద అతను పక్కా స్టేజ్‌స్పీకర్ క్రింద తయారయా డీమధ్య చిన్నచిన్న సభల్లో రెండుమూడు సన్మానాలుకూడా చేయించుకున్నాడు ఉపన్యసించేటప్పుడు చేతులు తెగఊపుతాడు గాలిలో అటు వొంగుతాడు ఇటు వొంగుతాడు కాకినాడ కళలకు నిలయమన్నాడు ఈనాడు తూర్పు పశ్చిమాల సంగమం ఇక్కడ ఏర్పడింది అన్నాడు అంటే తాను పశ్చిమ గోదావరిజిల్లాకు చెందినవాడిననీ, తురంగరావు తూర్పు గోదావరిజిల్లాకు చెందినవాడనీ తా మిరువురూ యిక్కడ తారసిల్లామనీ అతని తాత్పర్యం

మొత్తంమీద సభా, సభానంతరం నాటకం జయప్రదంగా జరిగిపోయాయి

పశుపతిగారు ప్రేక్షకుల్లో కూర్చుని ముందుకూర్చున్న ఛైర్మన్‌గారితో “కథానాయిక వేషం వేస్తున్న పిల్ల మా అమ్మాయి.” అన్నాడు సగర్వంగా

“ఓహో ! అలానా ? చాలా బాగా చేస్తోంది చాలా బాగా చేస్తోంది మంచి చురుకైనపిల్ల మంచి భవిష్యత్తు వుంది.” అన్నారు ఛైర్మన్‌గారు తల ఊపుతూ



# ఫోస్ఫోమిన్

శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.



సహనశక్తిని
హెచ్చించును.

శరీరముయొక్క రోగనిరోధక శక్తిని
ఎక్కువ చేయును.




అవును — కుటుంబము
అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్ బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

® ఇ. ఆర్ స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

SQUIBB® TTT®

SARABHAI CHEMICALS

Shilpi SC 50 A/67 Tel

"భవిష్యత్తంటే నాటకాలపిల్లగా తయారవటమేగా"

ఛైర్మన్‌గారి గొంతున పచ్చివెలక్కాయ పడిన ట్లయింది

"అసలు నాకు కళ అంటే చాలా అభిమానమండీ. మా అమ్మాయినికూడా చిన్నప్పటినుంచీ అన్ని కళల్లో పాల్గొనేటట్లుగా అభిరుచి కలిగించాను కాని అదే ఇప్పుడు పెద్ద అభ్యంతరమైందేమోనని బాధపడుతున్నాను మన సమాజం, వ్యవస్థా వ్యక్తిగత అభిరుచుల్ని బట్టి విలువల్ని నిర్ణయించలేదు మా అమ్మాయి జీవితం సుఖంగా గడవటానికి యిదో అడ్డంకి అయితే నా కింతకంటే శాప మేముంటుంది ?" అన్నారు పశుపతిగారు గంభీరంగా

చైర్మన్‌గారు అవునవు నంటూ తల ఊపారు.

* * *

నాటకం అయిపోయాక మాలతి గ్రీన్‌రూమ్‌లో కుర్చీలో చతికిలబడి నిట్టూరుస్తూ, "హమ్మయ్య, నా బాధ్యత తీరిపోయింది బాబూ ! ఇంకెప్పుడూ యీ జంఝాటంలో దిగను.' అంది

వైకుంఠం యీమాట విన్నాడు "అదేమిటండీ అలా అంటారు మీవంటి బ్రహ్మాండమైన నటి యిలా నిస్పృహ వహిస్తే రంగస్థలంగతి ఏం కాను ?" అని అద్దంలో చూసుకుంటూ రంగుమీసాలు చెరిపేసుకుంటున్నాడు.

"బ్రహ్మాండం - వల్లకాడు. నన్నిలా సామాన్యంగా బ్రతకనీయండి. మీ అందరి మాటకూ ఎదురాడలేక వప్పుకున్నాను చెబుతున్నాగా! యిహ స్టేజి ఎక్కటం యిదే ఆఖరిసారి అలా నిర్ణయించుకున్నాను"

శేఖరం అంతవరకూ ఎవరో స్నేహితులతో మాట్లాడి అక్కడికి హడావుడిగా వచ్చాడు. మనిషి ఉత్సాహంతో వూగిపోతున్నాడు "అమోఘంగా నటించారండీ మాలతిగారూ ! మిమ్మల్ని, అభినయం చూసి, మా మాలతిగారేనా అనుకున్నాను ఊపిపారేశా రనుకోండి," అతనిఉద్రేకం చూస్తుంటే ఆమె భుజాలు పట్టుకుని కుదిపేస్తాడేమోనన్న భయం కలిగింది మృత్యుంజయరావుకు. అతను దూరంగా నిలబడి అవలోకిస్తున్నాడు

"మీరూ చాలా బాగా నటించారండీ," అని జవాబిచ్చింది ఆమె చిరునవ్వుతో

"మీరు ఫార్మాలిటీకి అంటున్నారు"

"కాదు, నిజమేనండీ మహాశయా !"

మృత్యుంజయరావు చెవులు రిక్కించి వింటున్నాడు

"నా పర్యవేక్షణ ఎలా వుందో చెప్పరేమర్రా ?" అంటూ సోమయాజులు హడావుడి చేస్తూ వచ్చాడు

"బ్రహ్మాండం, అమోఘం." అని అరిచారు సభ్యులు

అంతా ఒకరినొకరు, పొగుడుకుంటున్నారు హర్షధ్వనులు చేస్తున్నారు. గ్రీన్ రూమంతా కోలాహలంగా వుంది బట్టలు మార్చేసుకుంటున్నారు రంగులు చెరిపేసుకుంటున్నారు. కేరింతాలు కొడుతున్నారు మృత్యుంజయరావు ఒక్కడే వంటరిగా నిలబడి అందర్నీ గమనిస్తున్నాడు అతని ఉనికి పట్టించుకున్నవారు లేరు

*　　　*　　　*　　　*

మరునాడు మాలతిని చూడటానికి అతనికి చాలా బిడియంగా అనిపించింది ఇన్నాళ్ళూ ఆమె తన పరిధిలోనే వున్నదనీ, ఆ పరిధిని దాటి అవతలకు వెళ్ళి తనని విస్మృతిలో పడవేసేటంతటి కాఠిన్యం ఆమెకు లేదనీ ఓ అభిప్రాయం వుండేది కాని నిన్నటితో ఆ భ్రమ తొలిగిపోయినట్లయింది ఆమె ముఖంవంక చూడలేక తల ఎత్తకుండా తనపని చేసుకుంటున్నాడు

కాని కొంతసేపటికి ఆమే వచ్చి అతన్ని చిరునవ్వుతో పలకరించింది "నిన్న మీరు కనబడనేలేదేమండీ?"

అతను ముఖం పైకి ఎత్తాడు ఎంత అమాయకంగా, నిర్మలంగా చూస్తోంది తనవంక




ఎక్కడ
# లైఫ్‌బాయ్ వున్నదో
# అక్కడ ఆరోగ్యము వున్నది

లైఫ్‌బాయ్ మురికిలో గల క్రిములను కడిగి వేస్తుంది

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి లింటాస్-L. 51-77 TL

క్షణంలో అతను పసిపిల్లాడిలా అయిపోయాడు "నిన్న గ్రీన్ రూమ్ నుండి చివర్న బయటకు వెళ్ళిన వ్యక్తిని నేనే మీరు నన్ను చూడకుండా ముందే వెళ్ళిపోయారు." అన్నాడు అతనికంఠం వణికిపోయింది

మాలతి ముఖంలోకూడా బాధ కనిపించింది "అయామ్ సారీ హడావుడిలో మీకు చెబుదామనికూడా మరిచిపోయాను. రాత్రి ఆ విషయమే తలుచుకుని చాలా బాధపడ్డాను," అంది తల వొంచుకుని.

ఆఫీసులోని మిగతా వ్యక్తులంతా తమవంక చూడటం అతను కనిపెట్టాడు. అతనికి సంతోషం కలిగింది, తమని గమనిస్తున్నవారిలో శేఖరంకూడా వున్నాడు. వాడి కంతేకావాలి శాస్తి, బాగా చూడనీ!

ఆమె బాధపడట మతను భరించలేక "అబ్బే! ఎందుకండీ అలా వర్రీ అవుతారు? మీ రసలే చాలా అలిసిపోయివున్నారు. మరిచిపోవటంలో అసహజ మేమీ లేదు," అన్నాడు మృదువుగా.

అతనున్న సీటుదగ్గరకు వచ్చి ఎక్కువసేపు నిలబడి మాట్లాడటం బాగుండదని

ఖాపించి "లీజర్ అవర్‌లో మీరు నాతో కాఫీ తీసుకోవాలి తప్పకుండా వస్తారుగా!"
అని అతని జవాబుకోసం ఎదురుచూడకుండానే తన సీటులోకి వెళ్ళిపోయింది

ఈ రోజు చాలా దివ్యమైనరోజుగా, యీ ప్రపంచమంతా నందనవనంగా కనిపించింది అతని కా క్షణంలో

'ఓ పువ్వులూ మీరంతా వికసించండి,' అని మనసారా వాంఛించాడు

'ఓ కోకిలా! నువ్వు గానం చెయ్యి మయూరమా పురివిప్పి నాట్యమాడు. సంపెంగా! నీ సౌరభాన్ని వెదజల్లు!'

'కాని' అత ననుకున్నాడు. 'నేను మంచివాణ్ని చెడ్డపనులు చేయను కనీసం చెడుకోరికలు కోరను '

తను యిన్నాళ్ళూ యాంత్రికంగా పనిచేస్తున్న లోకల్ ఫండ్ ఆడిట్ ఆఫీసు ఓగొప్ప ఆఫీసులా, తను గొప్ప ఉద్యోగస్థుడిలా కనబడ్డాడు

మిగతా సమయమంతా అతనికి చాలా ఉల్లాసంగా గడిచింది

ఒంటిగంట అవగానే ఉద్యోగస్థులంతా లేచి క్యాంటీన్ వైపు వెళ్ళారు. మృత్యుం జయరావు మెల్లిగా లేచి మాలతి సీటుదగ్గరకు వెళ్ళాడు.

కూర్చోండి." అన్న దామె ఆదరపూర్వకంగా

అతను కూర్చున్నాక అంతకుముందే తెప్పించిన రెండు గాజుగ్లాసుల్లో తను తెచ్చుకున్న ఫ్లాస్కులోంచి కాఫీ పోసింది "తీసుకోండి," అంది మృదుస్వరంతో

అతని కేం మాట్లాడాలో తెలియక మౌనంగా కాఫీ త్రాగుతున్నాడు

మాలతి అతనివంక చూస్తూ, "ఈ మధ్య మీరు రోజూ యింటివరకూ వచ్చి సాగనంపటం అలవాటయింది కదూ! నిన్న మీరు లేకుండా నాన్నగారితో వెడితే అదోలా అనిపించింది," అన్నది.

అతని మనసు ఉన్మీళితమైంది ఓ అమర్షభావం రక్తంలో ప్రతిఅణువులోనూ అంకురించింది ఏమీ మాట్లాడలేకపోయాడు

"నా నటననిగురించి అందరూ చెప్పారు. మీ రేం మాట్లాడరేం?"

"మీరు నటించలేదు," అన్నాడు.

"అదేమిటి?" ఆమె తెల్లబోతూ చూసింది

"పాత్రలో జీవించారు," తనమాటలు తనకే ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.

ఆమె ముఖంలో ఓ కాంతిరేఖ మెరిసి, అదృశ్యమైంది

"అంతేకాదు. ఇంకో విషయంకూడా చెప్తాను. అసలది వొట్టి చెత్త నాటకం. మీరు నటించటంవల్లే రక్తి కట్టింది."

"అఁ అఁ, ఆపండి. ఇదిమాత్రం ఆతిశయోక్తే."

"ఏమీకాదు. నాకు అలంకారాలుకూడా వచ్చునా ఏమిటి!" తనీరోజు చాలా బాగా మాట్లాడుతున్నాడు.

తర్వాత కొంతసేపటికి మాలతి, జగతి గురించి అడిగింది: "మీ అక్కగార్ని చూపిస్తానన్నారు - ఎప్పుడు ?"

"మీ యిష్టం. కాని ఆమె సాయంత్రాలు యింట్లో వుండదు. విద్యాధరస్వామి అని, యీ మధ్య మఠంలో భాష్యం చెబుతున్నాడు. రోజూ ఆయన ఉపన్యాసం వినటానికి వెడుతుంది! ప్రొద్దుటిపూట మీరు ఆఫీసుకు పోయేముందు అటువైపు వస్తే, కాసేపు మాట్లాడి ఆఫీసుకు వెళ్ళిపోవచ్చు."

"మీ యిల్లు ఎక్కడో నాకు తెలీదుగా"

"నేను మీ యింటికి వచ్చి మిమ్మల్ని తీసుకువెడతాను."

"ఎందుకులెండి మీకు శ్రమ. గుర్తులు చెప్పండి కనుక్కోగలను. కాకినాడలో పుట్టి పెరిగాను, ఆ మాత్రం తెలుసుకోలేనా ఏమిటి ?"

అతను వివరంగా గుర్తులు చెప్పాడు. "ఆ పసుపురంగు డాబాకదూ! అటువైపు చాలాసార్లు వెళ్ళాను. ఎటొచ్చీ మీ రందులో వుంటున్నారని తెలీ దంతే."

"ఎప్పుడు వస్తారు ?"

"రేపే."

మృత్యుంజయరావు యిహ వెళ్ళటానికి లేచి, "అన్నట్లు మా అక్కని గురించి యింటరెస్టింగ్ పర్సనాలిటీగా మిమ్మల్ని డిస్క్రయిబ్ చేసింది ఎవరు!" అని అడిగాడు.

"శేఖరంగారు; ఆయ నెప్పుడో చూశాడట."

శేఖరానికి తన అక్కనిగురించి మరో స్త్రీతో ప్రస్తావించవలసిన అవసరం ఏమొచ్చింది ? అయినా యీ విషయాన్ని గురించి వాళ్ళెప్పుడు మాట్లాడుకున్నారు ? వాళ్ళకి తీరిక ఎక్కడ చిక్కింది ? వాళ్ళు తరుచూ కలుసుకుంటూవుంటారా ?

అతని మస్తిష్కం అలా పనిచేసింది

(సశేషం)

**Printed and Published by Sri A Sudhakar Rao for Yuva Concerns at Yuva Press, Hyderabad-1 Telephones 36336, Press 34400 Controlling Editor - Sri "CHAKRAPANI"**







# ఫోల్డిలక్స్

మడత ఉక్కు సామ్గ్రి






## మన్నిక, హాయి,
## చౌకల హామీతో



అనేకసార్లు పరీక్షలకు లోనైన మేలిరకం ఉక్కు గొట్టాలతో తయారుచేయబడడమే గాక తుప్పుపట్టకుండాను, పగిలి పోకుండాను వుండడానికిగాను ప్రత్యేకంగా బాండ్‌రైట్ చేయబడినదన్న హామీకి గుర్తు అయిన 'క్రోమ్‌లైట్' మార్కుతో మడత పెట్టుకోడానికి అనువైన ఉక్కు సామాగ్రి ఫోల్డీలక్స్ అసాధరణమైన హాలో రివెటింగ్ "క్రోమ్‌లైట్" విశేష శ్రమకోర్చి జరిపిన పరిశోధనల ఫలితం ఇందులో వున్న ప్రతి ముక్క గట్టిదని, మన్నిక ఎక్కువని, అందానికి సాటిలేనిదని విడమర్చి చెప్పవలసిన పనిలేదు.

తేలికగానుంది, అనేక నమూనాల లోను, అనేక రంగులలోను లభ్యంకాగల ఫోల్డీలక్స్ మడత ఉక్కు సామాగ్రికి క్రోమ్‌లైట్ హామీకలదు.

ఉత్పత్తిదారులు :

**క్రోమ్‌లెట్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్**

హెడ్ ఆఫీసు పి-35 ఇండియా ఎక్స్‌ఛేంజి ప్లేస్, కలకత్తా ● వర్క్స్ 38/39, జి టి రోడ్ సాలికి హౌరా-7

మద్రాసు ఆంధ్రప్రదేశ్. మైసూరు రాష్ట్రాలకు, హైదరాబాద్,
బెంగుళూరు కలుపుకుని

ఏజంట్లు మహమద్ ఇబ్రహిం అండ్ కంపెనీ (ప్రై) లిమిటెడ్

కేరళరాష్ట్ర ఏజంట్లు సి పి లోనప్పన్ అండ్ సన్స్, ఎర్నాకుళం, కేరళ

## ప్రతియింట తప్పక వుండదగినవి!

# జిందా తిలిస్మాత్

దగ్గు,జలుబు,తలనొప్పి
వళ్ళునొప్పులు,డిసెంట్రీ,కలరాకు






# ఫరూకి పళ్ళపొడి

శుభ్రతకు,ఆరోగ్యకరమైనదంతములకు

తయారు చేయువారు:-

## కార్ఖాన జిందా తిలిస్మాత్



హైదరాబాద్; A.P.(INDIA)